





వస్తూంది!

వాహినీ వారి

# గుణసుందరి

కథ...

డాక్టర్. సుబ్బారావు...శివరావు...రేలంగి

శాంతకుమారి...మాలతి...శ్రీరంజని

నటించినవి..





N44

డైరెక్టర్...కె.వి.రెడ్డి, బి.యస్‌సి (ఆనర్సు)

# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు, చిక్కు చదరం, చిక్కు బొమ్మలు ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.


చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు.1.



ఆరోగ్యానికి, రుచికరానికి



పూజలకు, వివాహాలకు




గడియారం మార్కు

కర్పూరము

ఉపయోగించండి.

గోపాల్జీ చాంపర్సీ & కో.
గోవిందప్ప నాయక్ వీధి, మద్రాస్

# చందుయొక్క సాహసకృత్యములు


















## ది తాతా ఆయిల్ మిల్స్ కంపెని లిమిటెడ్

# ఆంధ్రా ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్

(స్థాపితము : 1925)

హెడ్ ఆఫీసు :

ఆంధ్రా ఇన్సూరెన్సు బిల్డింగ్సు, మచిలీపట్టణం.

జీవిత భీమాతో పాటు అగ్ని, మోటారు, నౌకా, ప్రమాదము, మొదలైన అన్ని రకముల భీమాలకు ఏర్పాట్లు గలవు. ఆస్తులు ఒక కోటీ 20 లక్షలకు మించినవి.

1948 లో పూర్తిచేసిన జీవితభీమా వ్యాపారము దాదాపు ఒకటిన్నర కోట్లు.
1947 వాల్యుయేషన్ బోనసు........ సాలుకు 1000 కి రు. 8 లు.

మద్రాసు ఆఫీసు : 337, తంబుచెట్టి వీధి

బ్రాంచీలు :

కలకత్తా, ఢిల్లీ, బొంబాయి, నాగపూర్, జంషెడ్పూర్, సికంద్రాబాద్, అనంతపురం, ఎర్నాకులమ్ (కొచిన్), బెల్గామ్, బెంగుళూర్, బరంపురం (ఒరిస్సా), బెజవాడ గుంటూరు, విశాఖపట్నం, కోయంబత్తూరు,

---
















# రు. 500 బహుమానము

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

ఉమా మహల్ :: మచిలీపట్నము

ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోస్టాఫీసు.

అసలు బంగారు రేకు లోహము పైన అంటించి (Gold Sheet Welding on Metal) తయారు చేయబడినవి. కాదని రుజువు చేసినవారికి రు. 500 బహుమానమివ్వబడును. మేము తయారు చేయు ప్రతివస్తువు పై ప్యాకింగు పైన "ఉమా" అను ఇంగ్లీషు అక్షరములు గుర్తించి కొనవలెను. బంగారు వన్నె 10 సంవత్సరములు గ్యారంటి.

* * *

పరీక్ష చేయగోరువారు ఉమా ఆభరణములను మహా ద్రావకములో వేసిన 5 నిమిషములకే బంగారము రేకు వెడలివచ్చును. ఈ విధముగా పరీక్ష చేసినవారు అనేకమంది మాకు సర్టిఫికేట్లు యిచ్చియున్నారు. 800 డిజయినుల క్యాటలాగు ఉచితముగా పంపబడును. ఇతర దేశములకు క్యాటలాగు ధరలమీద 25% అధికము.

*N.B.*—వస్తువుల వి. పి. పార్సిలు చార్జి 0-15-0 మాత్రమే అగును.

Tel : "UMA" MASULIPATAM.

## సెప్టెంబరు 24 న ప్రారంభమైంది !



స్వస్తిక్ వారి

# ధర్మాంగద

కృష్ణవేణి. ఋష్యేంద్రమణి. సత్యవతి. సూర్యకాంతం
డాక్టరు సుబ్బారావు. రాళ్లబండి. లింగమూర్తి. ఆరణి
నటించిన అద్భుత కథ



డైరెక్టరు :- **H.V. బాబు**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| విజయవాడ | – మారుతీ | | కాకినాడ | – మినర్వా | | సికింద్రాబాద్ | – పారమౌంట్ |
| విజయనగరం | – మినర్వా | | ఏలూరు | – పాండురంగా | | వరంగల్ | – జై హింద్ |
| విశాఖపట్నం | – ,, | | తెనాలి | – రత్నా | | నెల్లూరు | – మణి |
| రాజమండ్రి | – ,, | | గుంటూరు | – రాధాకృష్ణ | | భీమవరం | – మారుతి |

30 - 9 - 49 నుండీ : కర్నూల్ - చాంద్ ★ నంద్యాల - నేషనల్

త్వరలో : బళ్లారి - రాయల్‌లో విడుదల.

---

చమ్రియావారి విడుదల

# మీరూ ఇలా హాయిగా ఉండవచ్చు!



"నేను 'కో-ఆప్టెక్స్' దుస్తులు వాడటం మొదలు పెట్టానని సంతోషిస్తున్నాను. సౌకర్యాన్నీ, నాగరికతనూ, ఆనందాన్నీ ఇచ్చే రకాలున్నాయి. మీరూ 'కో-ఆప్టెక్స్' నే వాడండి."

చేతి మగ్గాల నుండి
సరాసరి మీకు

- కోటింగులు
- షర్టింగులు
- సూటింగులు
- ధోవతులు
- తువాళ్లు
- జేబురుమాళ్లు

పేరు చూచి మరీ కొనండి

## కో-ఆప్టెక్స్

మేలైన చేనేత వస్త్రాలు

మద్రాసు హాండ్‌లూం వీవర్సు ప్రొవిన్షియల్
కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్
"హాలోవేస్ గార్డన్సు"
34, పాంథియన్ రోడ్, ఎగ్మూర్, మద్రాసు.

# సావరిన్ సూక్తులు



రైలు బిళ్లలో తెగనమలొచ్చు.
ట్రాముల్లో మరి తినొచ్చు నీ యిష్టం.
బస్సులలో ఇక బలే బాగు.
ఒకటననేల అన్ని వేళల, అన్నిచోట్ల.
కాని, వినవోయి! ఒక మాట

**బడిలో మాత్రం తినొద్దు నీవు**




# సావరిన్ స్వీట్స్

ది కె. సి. పి. కన్ఫెక్షనరీ (మద్రాసు) లిమిటెడ్, మద్రాసు-24.




అక్టోబరు 1

ఆంధ్ర దేశమంతటా విడుదల

దర్శకుడు
రామకృష్ణ




భరణీ వారి

# లైలామజ్ను

(తెలుగులో)

భానుమతి...నాగేశ్వరరావు...సి.యస్.ఆర్...శివరావు

నృత్యము.. లలిత, పద్మిని

రచన సముద్రాల... ఛాయ B.S.రంగా... నృత్య దర్శకుడు రాఘవయ్య... సంగీత దర్శకుడు C.R.సుబ్బరామన్




విడుదల
- ఆంధ్ర, సీడెడ్, నైజాము-పూర్ణా పిక్చర్సు, బెజవాడ.
- మైసూరు: ప్రభా పిక్చర్సు, బెంగుళూరు.
- తమిళనాడు: జూపిటర్ పిక్చర్సు సర్క్యూట్, మద్రాసు.




సంపుటి 5
సంచిక 4

సంచాలకుడు: చక్రపాణి

అక్టోబరు
1949

# విజయదశమి

మన పండుగలలోకెల్లా దసరా ముఖ్యమైన పండుగ. దసరాలలో వచ్చే ఈ ఆశ్వయుజ శుద్ధ దశమి అనేకవిధాల ప్రసిద్ధిచెందింది. ఆదిశక్తి అయిన దుర్గాదేవి మహిషాసురుడనే రాక్షసుణ్ణి ఈరోజుననే సంహరించింది. జమ్మిచెట్టుమీద దాచుకొన్న తన గాండీవమును అర్జునుడు మళ్ళీ చేపట్టినది ఈ రోజుననే. శ్రీరామచంద్రుడు రావణునిమీదికి దిగ్విజయంగా తలపడినది ఈ రోజుననే. ఇటువంటి విజయాలను చేకూర్చిన గొప్ప రోజు కనుకనే దీనిని 'విజయదశమి' అన్నారు. ఈ పండుగ పదిరోజులూ ఏటేటా బంగాళాదేశంలో జరిగే కాళీపూజలు, మైసూరులో జరిగే మహోత్సవాలు, మన ప్రాంతంలో కన్నుల వైకుంఠంగా ఇంటింటా నెలకొల్పబడే బొమ్మల కొలువులు, చిన్నారి పాపలు కొత్త కొత్త దుస్తులు ధరించి, విల్లంబులు చేతపట్టి చూడ ముచ్చటగా అయ్యవారివెంట నడిచే నడకలూ—ఇవన్నీ మనకు అద్భుతమైన పూర్వగాథల నెన్నిటినో జ్ఞప్తికితెస్తాయి.



# ఉడుకు పండ్లు

నేరేడు చెట్టుపై
దోర కాయలు తింటు
భారాటి పిల్లోడు
కూయుచుం డున్నాడు.

మధ్యాహ్న పెండ మల
మలని మాడుస్తుంటె
భూమంత నిప్పులో
పొరలాడి నట్టుంది.

అప్పు డొక ముసలాది
డాహారె పోతుండి
"బాబయ్యా! నా కొక్క
పండు పడవే" తంది.

పిల్లవాడు
"చల్ల చల్లని పండు
జల జలా రాల్చేద?
వెచ్చ వెచ్చని పండ్లు
విసరి పడవేసేద?"

ముసలమ్మ
"వెచ్చన్ని పండ్లేటి?
విడ్డూర మైతె
ఉడు కుడుకు పండ్లనే
పడవేయి చూతాము."

అనగానె పిల్లవా
డల్లంత దూరాన

రచన :

"ఏటుకూరి"

కిసుకలో పడునట్లు
విసరాడు పండ్లిన్ని.
పండ్లకై ముసలమ్మ
పడుతు పడుతూ పోయి
ఒకటి రెం డేరుకొని
ఊదుకో సాగింది.

పిల్లవాడు

" ఉప్ఫుప్ఫు మనుకొంటు
ఊదుతా వేమవ్వ!
అంతుడుకుగా నున్న
వా? యేటి చెప్పవూ?"

ముసలమ్మ

" ఉడుకేటి పిల్లోడ?
చెడ గాలిపోతుం లె!"

పిల్లవాడు

" కాబట్టె నల్లబడి
కమలి పోయిన వవ్వ!
మండు పొట్టకు వేడి
పండు పడవేస్తివా?
ఉడు కుడుకుతో చల్ల
పడిపోత" దన్నాడు.
అవ్వ నవ్వుతు " మన్మ
డా! కొంటె వో" యంది.
మనుమ "డైతే నీవు
మంచవ్వ" వన్నాడు.








పూర్వకాలమందు ఒక రాజు. ఆ రాజుకు అందమైన కోట ఉన్నది. ఆ కోట సమీపాన గొప్ప అరణ్యములో ఎనమండుగురు వనకన్యలుండేవారు. అందులో ఏడుగురు కన్యలు మంచివాళ్లు, రాజుకి మేలు కోరే వాళ్ళున్ను, ఎనిమిదవది దుష్టకన్య, అపకారి.

మంచికన్యలు ఏడుగురూ చక్కటి చిన్నచిన్న పర్ణశాలలలో నివసించేవారు. దుష్టకన్య నరుల కంటపడకుండా, మారుమూల ఒక చీకటిగదిలో కాలక్షేపం చేసేది.

ఇలా వుండగా, రాజుగారికి కుమార్తె పుట్టింది. ఆ శిశువు అపురూపమయిన కాంతితో వెలిగిపోతూండడంచేత 'కాంతిబాల' అని పేరు పెట్టారు.

కాంతిబాల పుట్టిందనగానే ఊరందరూ చూడవచ్చారు. వనకన్యలు ఎనమండుగురూ వచ్చారు. మంచికన్యలు ఏడుగురూ కాంతిబాలకు మంచిమంచి కానుకలిచ్చి, చల్లగా ఉండుమని దీవించారు. దుష్టకన్య మాత్రం అలాగ కాక, 'పగటిపూటంతా నిద్రమైకంలో ఉండిపోవలిసిందీ!' అని కాంతిబాలకు శాపం పెట్టింది.

ఈ శాపం విని, రాజూ రాణీ దుఃఖ సముద్రంలో మునిగిపోయారు. గత్యంతరం తోచక, కోటలో అందరూ కుంగిపోయారు.

ఆ సమయంలో ఆరవకన్య వచ్చి, 'కాంతిబాల రాత్రిపూటంతా మేలుకొనే వుండాలి' అని వరమిచ్చింది.

'నామాట పూర్తికాకుండా నువ్వెందుకు నోరు విప్పుతావు?' అని మండిపడుతూ దుష్టకన్య, 'సరే. కాంతిబాల రాత్రిళ్ళు మేలుకొనే వుంటుంది. కాని చందమామతో పాటు ఆమె కాంతి కూడా పున్నమికి

కె. జె. పట్నాయక్, నర్సీపట్నం

పూర్తి అయి, అమావాస్యకు అంతరించి పోవాలి' అని మళ్లీ తీవ్రంగా శపించింది.

అంతలో ఏడవకన్య ముందుకు వచ్చి, "తనకు తెలియని ఒక రాజకుమారుడు కాంతిబాలను తాకిన వెంటనే ఆమెకు శాప విముక్తి అయిపోవాలి!" అని చెప్పి దీవించింది.

ఇక చేసేది లేక, ఎలా అయినా కాంతిబాలను కష్టాలపాలు చేసి కసి తీర్చుకుందామని దుష్టకన్య కనిపెట్టుకొని వున్నది.




పాపం, కాంతిబాల పగలల్లా నిద్దరే కాని, కన్నెత్తి చూచేది కాదు. బహుళ పాడ్యమి మొదలుకుని రోజురోజుకీ ఆమె ముఖం పాలిపోయి, శరీరం కృశించి, అమావాస్యనాటికి కదలక మెదలక పడుకునేది. శుక్లపక్షం ప్రారంభం కాగానే, దినదినమూ అందచందాలతో వెలుగతూ, పున్నమినాడు పూర్ణమయిన కాంతితో ప్రకాశించేది.

తనకు శాపం తగిలినసంగతీ, ఆ శాపం వల్ల తనకు వికృతరూపం వచ్చే సంగతీ లోకానికి తెలిసిపోతుందేమో నని, కాంతిబాలకు భయ గావుండేది. అందుచేత ఆమె ఒంటిపాటుగా అరణ్యంలో సంచరించడం అలవాటు చేసుకొన్నది. రాజు ఇది కనిపెట్టి, అడవిలోనే ఆమెకు ప్రియమయిన ఏకాంతస్థలంలో ఒక సుందరమయిన పువ్వుల కుటీరం కట్టించి ఇచ్చాడు. అందులో ఆమె చెలికత్తెలను పెట్టుకొని, ఇష్టం వచ్చినట్టు ఆడుకొనేది.

* * *

ఈ రాజ్యానికి దగ్గరగానే మరివక రాజ్యం ఉన్నది. ఆ రాజుని శత్రువులు చంపివేసి రాజ్యం ఆక్రమించుకొన్నారు. బతుకు జీవుడా అని చెప్పి, రాజకుమారుడు మాత్రం మారువేషంతో తప్పించుకొని, ఈ అరణ్యం చేరుకొన్నాడు.

అతను తిరిగి తిరిగి అలసిపోయి, ఒక చెట్టుకింద పడుకున్నాడు. వెన్నెల రాత్రి కావటంచేత కాంతిబాల కలకల్లాడుతూ నాట్యంచేస్తూ, కోకిలకంఠంతో గానం చేసుకొంటూ అతను పడుకొనివున్న ఆ చెట్టు వేపు వచ్చింది.

ఇటువంటి రూపవతిని మునుపెన్నడు రాజకుమారుడు చూచిఎరుగడు. ఈమె ఫలానా రాజుకూతురు అనికూడా అతనికి తెలియదు. అందుచేత, ఆమె దేవకన్య ఐ వుంటుందని అనుకున్నాడు. ఆమె అందచందాలనూ, ఆటపాటలనూ అతను రెప్ప వాల్చకుండా గమనిస్తూ వుండేటంతలో కాంతిబాల అదృశ్యమయిపోయింది.

రాజకుమారుడు ఆమెకోసం రోజూ వెతుకుతూనేవున్నాడు. రాత్రిపూటమాత్రం ఆమె చెట్టువద్దనే కనపడుతూ, అతను చూస్తూవుండగానే మాయమయిపోతూ వుండేది. రోజురోజుకీ ఆమె సౌందర్యం ఎక్కువ అవుతున్నట్టుకూడా రాజకుమారుడు కనిపెట్టాడు. కనుక ఇటువంటి అపురూపమైన యువతిని ఎలాఅయినా కలుసుకొని, ఆమె చరిత్ర తెలుసుకోవాలెనని అతనికి పట్టుదల ఎక్కువయింది.





తిండీ నిద్రా లేకుండా ఆమెకోసం అతను అలా తిరుగుతూవుండగా, మంచి కన్యలలో ఒకతె అయిన ఏడో కన్య ఒక ముసలవాని రూపంలో అతనికి అగపడింది. తను లోగడ దీవించినట్టుగా పొరుగుదేశపు రాజకుమారుడు కాలవశముచేత ఇప్పుడు ఈ అడవికి వచ్చేశాడు. కనుక, త్వరలోనే కాంతిబాలకు శాప విముక్తి కాబోతుంది కదా అని ఆమె మనసులో ఎంతో సంతోషించింది.



ఈ సంతోషంతో ఆమె రాజకుమారుణ్ణి తన కుటీరానికి తీసుకువెళ్లి, అనేక విధాల ఆదరించింది. తరువాత కాంతిబాలను గురించిన చిత్రాలన్నీ చెప్పి, మహిమగల ఒక లోటా కూడా బహుమతి చేసింది. ముసలామె దీవనపొంది రాజకుమారుడు మళ్లీ కాంతిబాలను వెతకబోయాడు.

రాజకుమారుడు దారితప్పి ఈ అడవిలోకి వచ్చి, కాంతిబాలకోసం వెతుకుతున్న సంగతి దుష్టకన్యకు ఈక్షణంవరకు తెలియనేలేదు కాని, ఈ వర్తమానం తెలిసిన వెంటనే, కొన్నాళ్లవరకూ రాజకుమారునికి కాంతిబాలతో సమాగమం కాకుండా, ఆమె మంత్రించివేసింది.

'పున్నమి దాటిపోయేవరకూ తన మంత్రబలంచేత వాళ్లు కలుసుకోకుండా చెయగలిగినట్టైతే, ఆపైన కాంతిబాల కురూపి అయిపోతుంది కదా. అప్పుడు రాజకుమారుడు అనాకారిగావున్న ఆమెను చూచి అసహ్యించుకొంటాడు గాని మక్కువ పడడు కదా. కనుక, ఏడవ కన్య ఇచ్చిన దీవన వ్యర్థమైపోతుంది' అని దుష్టకన్య ఆలోచించింది.

దుష్టకన్య మంత్రించినప్పటినించీ, ఆ ప్రభావంవల్ల రాజకుమారుడు పాపం మళ్లీ నిద్రాహారాలు లేకుండా ఎంత తిరిగినా కాంతిబాల కంటికి కనబడలేదు.

కొద్దిరోజులయిన తరువాత, ఒకనాడు అతను నిరాశచేసికొని, ఒక పెద్ద మర్రిచెట్టు కింద విచారంగా కూర్చున్నాడు.

అప్పటికి పున్నమి దాటిపోయి, అమావాస్యకూడ వచ్చేసింది. సరిగా అమావాస్య నాటికి దుష్టకన్య ప్రయోగించిన మంత్ర బలం సరిపోయింది. మళ్లీ మంత్రం వేయాలంటే ఆమెకు కొంత వ్యవధి కావాలి.

రాజకుమారుడు మర్రిచెట్టుకింద కూర్చునివుండగా గబగబా మేఘాలుకమ్మి, ఉరుములతో, పిడుగులతో గొప్ప వర్షం కురిసింది. అంతలో ఒక్క మెరుపు మెరిసి, ఆ మెరుపు వెలుగులో చెట్టుకింద ఏదో మెదిలినట్టు అలికిడి అయింది.

ఆ దగ్గిరికి వెళ్లి రాజకుమారుడు చూచే సరికి, ఒక ముసలిది ముసుగువేసుకొని పడుకున్నట్టు కనిపించింది. మెల్లగా అతను ముసుగు తొలగించి, అవ్వ తనకిచ్చిన లోటాలోని నీళ్లు గుక్కెడు ఈ ముసలిదాని నోటిలో పోశాడు.

అతను తాకిన తక్షణమే ఆ ముసలిది ఒక అందాల బరిణ అయిన రాజకుమారిగా మారిపోయింది. అవ్వ చెప్పిన కాంతిబాల ఈ సుందరే అయివుంటుందని రాజకుమారుడు గ్రహించాడు.

మరి కొంచెంసేపటికే వర్షం నిలిచిపోయి తెల్లవారింది. పుట్టిన ఇన్నాళ్లకు, కాంతిబాల వెలుగు చూచింది! ఆమెకు శాపవిముక్తి కాగానే ఏడుగురు కన్యలూ వచ్చేసి, రాజకుమారుణ్ణీ, కాంతిబాలనూ రాజు వద్దకు తీసుకువెళ్లారు. వాళ్లిద్దరకు అతి వైభవంగా పెళ్లి అయి, హాయిగా వున్నారు. కాంతిబాల పెళ్లిసమయమున ఏడుగురు కన్యలకూ రాజావారు వెలలేని బహుమానాలు ఎన్నో ఇచ్చి సంతోషపెట్టారు. దుష్టకన్యను విరిచి కట్టి, శూర్పణఖకుమల్లే ముక్కూ చెవులూ కోసి అడవులలోకి సాగనంపారు.






పూర్వకాలమందు ధారానగరాన్ని ఉగ్రసేన మహారాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయనకి ఆగ్రహం వచ్చినా అనుగ్రహం వచ్చినా పట్టపగ్గాలుండవు.

ఆ మహారాజుకి రూపసుందరి, హేమసుందరి, గుణసుందరి అని ముగ్గురు కుమార్తెలు. గుణసుందరి పుట్టిన కొద్ది రోజులకే మహారాణి స్వర్గస్థురాలైంది. అప్పటినించీ మహారాజు తన కూతుళ్ళు ముగ్గురకూ తల్లిలేని లోపం కలుగకుండా, వాళ్ళ ఆలనా పాలనా స్వయంగానే చూస్తూ పువ్వులలో పెట్టి బిడ్డలను అల్లారుముద్దుగా పెంచుకొంటున్నాడు.

ఈ మమకారంలో పడి, మహారాజు రాజ్యమూ, రాచకీయాలూ మరచేపోయాడు. మంత్రులూ, సేనాధిపతులూ మొదలైన ప్రముఖులందరూ మహారాజును దర్శించి, "దేవరా!—తమకు పుత్రసంతానం లేదు. ముందు రాజ్యం గతి ఏంకావాలె! మా మనవి మన్నించి మళ్లీ పెళ్లి చేసుకొన్న పక్షమందు తమకు వంశాధారమైన పుత్ర సంతానమూ కలుగుతుంది, మా కోరిక కూడా నెరవేరుతుంది" అంటూ విన్నవించుకొన్నారు.

ఈ మనవికి మహారాజు మండిపడి, "వంశానికి ఆధారం కొడుకులేనా? కుమార్తెలు మాత్రం నా అంశలు కారా? నా రాజ్యం నా కూతుళ్ళకే ఇస్తాను. వాళ్లే నా రాజ్య మేలుతారు. నా మాటకు ఎవ్వరు అడ్డం వస్తారో చూస్తా" నంటూ, పరివారాన్నంతటినీ కసిరికొట్టాడు.

ఇలా వుండగా, ఒక సంక్రాంతి పండుగ నాడు, మహారాజు అల్లారుముద్దుగా పెంచుకొంటూవున్న కూతుళ్ళు ముగ్గురకోసం, రాజ్యంలో ప్రజలు అపురూపములైన కానుకలెన్నో పట్టుకువచ్చి, సమర్పించారు. ఆ

'నాగేంద్ర'





పట్టుకువెళ్లి ఇచ్చింది. మహారాజు ఆనంద భరితుడై, తన చిన్ని కూతురికి తనపైగల భక్తి ఎటువంటిదో తెలిసికోమంటూ, ఆ చేతికర్రను పరివార మందరకూ ముచ్చటగా చూపించాడు.

మహారాజుకు హరమతీ కాలమతీ అని ఇద్దరు మేనల్లుళ్ళు ఉన్నారు. వాళ్ళు ప్రపంచజ్ఞానం లేని వట్టి మూర్ఖులూ, సాపాటురాముళ్లున్నూ. అయినా, వాళ్లంటే మక్కువ కావటంచేత వాళ్ళను పెద్దమ్మాయిలు ఇద్దరకూ నిశ్చయించి, చిన్నమ్మాయికి వరుడు చిక్కగానే, మూడు పెళ్లిళ్లూ ఒక్కసారి చేసేసి, రాజ్యం కుమార్తెలకు వప్పగించి, తను విశ్రాంతి తీసుకొందామని అనుకున్నాడు మహారాజు.

ఇంతలో మహారాజుగారి షష్టిపూర్తి మహోత్సవం అతివైభవంగా జరుగుతున్నది. ఆ రోజున ఆయన సగర్వంగా కుమార్తెలను వెంటబెట్టుకుని సభకు వెళ్ళాడు. నిండు దర్బారులో మహారాజు "చూడండి, పదహారేండ్లుగా నాసర్వస్వమూ వినియోగించి సాధించిన రత్నాలు ఈ నా ముగ్గురు కుమార్తెలూను. ఇక నా రాజ్యం వీళ్ళకే ఇస్తాను. వీళ్ళకు నేనంటే

కానుక లన్నిటినీ మహారాజు చూడ ముచ్చటగా అమర్పించి, కుమార్తెలు ముగ్గురనూ ఎవళ్ళకది ఇష్టమో ఎంచుకోమన్నాడు.

పెద్దవాళ్ళయిన రూపసుందరీ, హేమసుందరీ కలిసి ఆ బహుమతులలో ఉండే విలువైన చీనిచీనాంబరాలకోసమూ, మణిహారాలకోసమూ పోటీపడి కాట్లాడుకోబోయారు. సాత్వికురాలైన గుణసుందరి మాత్రం "పతివ్రతా కథాలహరి" అనే పుస్తకం ఒక్కటి తీసుకొని, పితృభక్తి కలది గనుక, రాశిలోనించి ఒక చక్కటి చేతికర్ర ఎంచితీసి, వృద్ధుడైన తండ్రికి

ఎంత భక్తి, ఎంత ప్రేమ! అది ఎటువంటివో వాళ్ళే చెప్తుతారు. విని ఆనందిద్దురు గాని..." అంటూ చెప్పి కూర్చున్నాడు.

అప్పుడు పెద్దకూతురు రూపసుందరి లేచి, సభకు నమస్కరించి, తడుముకోకుండా తీయని మాటలతో "నాకు నా తండ్రే ప్రాణం, తండ్రే దైవం, తండ్రే సర్వమున్నూ" అని బొంకింది.

తరువాత రెండవకుమార్తె హేమసుందరి కూడా సభకు నమస్కరించి, తన అక్క చెప్పినట్టుగానే, "నేను నా తండ్రి సేవ కోసమే జన్మించాను. ఎన్ని జన్మలకైనా ఆయనే నా తండ్రి కావాలని తపస్సు చేస్తాను" అంటూ బొంకి కూర్చున్నది.

రూపాహేమలు కేవలమూ స్వార్థపరలు. తండ్రిని మెప్పించాలని అబద్ధాలాడారు. గుణసుందరి ఉత్తసత్యకాలపుపిల్ల. నిజానికి తండ్రిమీద గుణసుందరికే ఎంతో ప్రేమ ఉన్నది. ఆ సంగతి మహారాజుకీ తెలుసు. అందుచేతనే, పెద్దపిల్ల లిద్దరికంటే కడసారిది అయిన గుణసుందరి తనను మరీ ఎక్కువగా పొగడుతుందని ఆశించాడు.

నిజం చెప్పవలసివస్తే, తన జవాబు తండ్రికి రుచించదు. అందుచేత ఇటువంటి






సందర్భంలో ఊరుకోవడమే మంచిదని తలంచి, గుణసుందరి మాటాడక నిలిచింది. ఈ వాలకంచూచి ఆమె సిగ్గుపడుతున్నది కాబోలునని తలిచాడు మహారాజు. "అమ్మాయీ! నీ అక్కలకంటే నీకు నా మీద ప్రేమ ఎక్కువ. నన్ను గురించి వాళ్ళకంటె నీవే బాగా చెప్పగలవు. కనుక చెప్పమ్మా!" అని అన్నాడు.

అప్పుడు గుణసుందరి "నాయనగారూ! తండ్రిని కూతురు ఎంతవరకూ ప్రేమించాలో, అంతగా నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. కాని స్త్రీకి భర్తే సర్వమున్నూ. వివాహమైనప్పటినించీ సతికి, పతిని సేవించడమే విధాయకం" అంటూ, మనసులో మాట దాపరికం లేకుండా వెల్లడించే వరకు, మహారాజు ఉగ్రుడైపోయాడు.

"కృతఘ్నురాలా! పిచ్చిగా మాటాడుతున్నావు. భర్త కుంటీ, గ్రుడ్డీ, మూగా, చెవిటీ, వృద్ధూ, దరిద్రుడూ అయినట్టయితే, అతడే సర్వస్వమని ప్రేమిస్తావా?" అని అధిక్షేపించాడు మహారాజు.

"దేవుడు అటువంటి భర్తనే నిర్ణయించే పక్షమందు, సంతోషంతో శిరసావహించి ప్రేమిస్తాను" అని గుణసుందరి నిబ్బరంగా జవాబు చెప్పింది.

"దేవు డెవరు? నేనా, దేవుడా నీకు పతిని నిర్ణయించేది?" అన్నాడు మహారాజు. అందుకు గుణసుందరి మృదువుగా "దేవుడే, నాన్నగారూ!" అని సమాధానం చెప్పింది. అప్పుడు మహారాజు "అబ్బో, అంత గర్వగా ఉన్నదా నీ పని? తగిన శాస్తి చేస్తానుండు" మంటూ గద్దించి, ఆగ్రహంతో సభవిడిచి వెళ్ళిపోయాడు.

రాజు తలిస్తే దెబ్బలకు కొదువా? మరునాడే ముహూర్తం పెట్టించాడు మహారాజు. రూపసుందరిని హరమతికీ, హేమసుందరిని కాలమతికీ ఇచ్చి వైభవంగా పెళ్ళి

చేశారు. పాపం, గుణసుందరికిమాత్రం కుంటీ, గ్రుడ్డీ, మూగా, చెవిటీ అయిన ఒక దరిద్రుణ్ణి తీసుకవచ్చి కట్టబెట్టారు.

తండ్రి చేసిన ఈ అఘాయిత్యానికి గుణసుందరి ఏమాత్రమూ చలించక, దైవంమీద భారంవేసి నిశ్చింతగా ఉంది. తనకు ఈ భర్త లభించటం ఈశ్వర ప్రసాదమే అని నమ్మి, శిరసావహించి, అమె భక్తితో పతిని సేవిస్తూ ఉంది.



పెళ్ళి అయిన మరుక్షణంనించీ రూపా, హేమలు వాళ్ళ అందచందాలకు ఉబ్బిపోతూ, తమతమ అదృష్టాలకు మిడిసిపడుతూ, భర్తలతోకలిసి చెల్లెలినీ మరదినీ నిరసించి వేళాకోళం చేయ నారంభించారు. ఎవరేమనుకొన్నా, ఎన్నెన్ని తిప్పలు పెట్టినా, గుణసుందరి మాత్రం వాటిని పాటించక, ఓర్చుకుంటూవుంది.

దైవాన్ని నమ్మినవాళ్ళకు ఎప్పటికీ చెరుపు లేదంటారు పెద్దలు. మొదటినించీ దేవుణ్ణే నమ్ముకొనివున్న గుణసుందరి జీవితంలో తలవని తలంపుగా ఒక చిత్రమైన మార్పు వచ్చింది. మహారాజు గుణసుందరికి శాస్తి చేదామనే సంకల్పంతో ఏరీ, కోరీ తెచ్చిన ఆమె భర్త—అందరూ అనుకొన్నట్టు కుంటీ కాడు, గ్రుడ్డీకాడు, మూగా కాడు, చెవిటీ కాడు.

ఉన్నట్టుండి అతను వింతగా గెంతుతూ, చిత్రంగా ఛలోక్తులు విసురుతూ, వదినెలనూ వారి భర్తలనూ భరతంపట్టి, వెంటాడటం మొదలెట్టాడు. వాళ్ళందరకూ ఏమీ తోచక కంగారుపడుతున్నారు. ఈ విధంగా రాజావారి చిన్నల్లుడు వింతగా విజృంభించే వరకు, కోటంతా ఒక కొలిక్కి వచ్చింది. ఈ హడావిడి అంతా తెలిసి, మహారాజు కూడా పరుగెత్తుకువచ్చి, కళ్లారా చూశాడు.

తాను గుణసుందరికి పాఠం చెప్పాలని ఇంతా చేస్తే, వీడెవడో తనకే శాస్తి చేశాడే



అని మహారాజు మండిపడుతూ, "ఎవడవురా నీవూ, నీ అగడమూనూ? నన్నే మోసం చేశావే? చూసుకో, నీ పని ఏమవుతుందో!" అని గర్జించాడు.

అందుకు గుణసుందరి భర్త ఠీవిగా నుంచొని, "నేను మీ ముద్దుటల్లుడ్ని. దైవాధీనాన్ని" అంటూ, చిద్విలాసంగా నవ్వాడు. దానితో, ఆవేశపూరితుడైన మహారాజుకి కంపరమెత్తి, దైవాధీనాన్ని కొట్టబోయి, పట్టు తప్పి దభాల్న కింద పడ్డాడు. ప్రమాదకరమైన దెబ్బలు తగలటంచేత, మహారాజు లేవలేక పోయాడు. ఆ పాటు గ్రహపాటై, ఆయనను మంచంపట్టించింది.



గుణసుందరి దుఃఖిస్తూ తండ్రి దగ్గరకు వెళితే, "ఇది నా చావుకు పుట్టింది; వాడెదో పంపకం; వీళ్ళను సాగనంపండి" అంటూ మహారాజు ప్రలాపించాడు.

అక్క లిద్దరూ ఆమెను చూచి, "పుట్టిన నాడు అమ్మను సాగనంపావు; పెళ్లినాడు అయ్యను మంచమెక్కించావు. చాల్లే..." అని కసిరికొట్టారు.

ఈ మాటలకు గుణసుందరి భర్తకు పౌరుషం వచ్చింది. భార్యను తీసుకొని తిన్నగా మామగారి వద్దకు వెళ్లి, "ఎప్పటికైనా మేమే నీకు దిక్కయ్యేది. జ్ఞాపకం ఉంచుకో" మని హెచ్చరించి, దైవాధీనం భార్యతో సహా కోట దాటి వెళ్లిపోయాడు.

ఆ నగరు చివర ఎరుకలగూడెంలో, దైవాధీనం కాపురం పెట్టాడు. రాచకోటలోని రణగొణ అంతా ఊళ్లు దాటి, కోళ్లు దాటి, ఎరుకలగూడానికి కూడా ముందే తెలిసిపోయింది. రాజ్యలక్ష్మి కోట విడిచి, తమ గూడానికి వచ్చిందని సంబరపడుతూ, ఆ గూడెంవాళ్లు దైవాధీనానికీ, గుణసుందరికీ భక్తితో స్వాగత మిచ్చారు. క్షణంలో వారు ఆమెకు ఒక పర్ణశాలను తయారుచేశారు. కుటుంబానికి కావలసినవన్నీ చిటిక





సేవటిలో సమకూర్చిపెట్టారు. ఈ విధంగా ఇప్పుడు గుణసుందరికి వింత భర్తతో కొత కాపురం ప్రారంభమైంది. పాపం, తండ్రి అవస్థ తలుచుకొంటె పొరలివచ్చేదుఃఖాన్ని దిగమింగుకొని, భక్తి శ్రద్ధలతో ఆమె భర్తను సేవిస్తున్నది.

మహారాజు మంచంపట్టగానే ఇంట్లో అంతా రూపా హేమల శాసనంగా ఉన్నది. గుణసుందరి పూజించుకుంటూ వుండే శ్రీరాజరాజేశ్వరీ విగ్రహమూ, ఆమె నిత్య పారాయణ చేసుకొనే "పతివ్రతా కథా లహరి" పుస్తకమూ—ఈ రెండూ ఇంట్లో ఉండటం వాళ్లకు అనర్ధకంగా తోచింది. అందుచేత, వాటిని తీసి పారవేయించ బోయారు.

ఈ సంగతి, దాది మీనాదేవికి తెలిసింది. మీనాదేవి గుణసుందరికి తల్లితో సమాను రాలు. ఆ అభిమానంచేత, గుణసుందరికి అపచారము జరగకుండా, రాజేశ్వరీ విగ్రహమూ, పతివ్రతా కథాలహరి పుస్తకమూ, అవసరమైన కొన్ని నగలూ బట్టలూ ఒక కావడిపెట్టెలో పెట్టి, అది పట్టించుకొని గుణసుందరికి ఇచ్చివద్దామని ఆమె ఎరుకలగూడానికి బయలుదేరింది.




దాది మీనాదేవి ఇంటికి రాగానే, ఆమె తన స్థితి చూచి ఎక్కడ జాలిపడిపోతుందో నని తలచి, గుణసుందరి లేని సంతోషం తెచ్చిపెట్టుకొని, తండ్రి క్షేమసమాచారాలు అడిగింది.

ఆమె తెచ్చిన వస్తువులు చూచి, "ఇవన్నీ ఏమిటి ? రాచవారి సొత్తు పూచికపుడకైనా నాకు గిట్టదు. పట్టించుకు పోవలసిందే" అన్నాడు దైవాధీనం. అప్పుడు మీనాదేవి "పోనీ, వీటినైనా ఉంచుకొండి" అని చెప్పి దీనంగా బతిమాలుతూ దేవీవిగ్రహాన్ని, పతివ్రతా కథాలహరి పుస్తకాన్ని విడిగా తీసి పెట్టింది. దైవాదీనం భార్య వేపు

చిలిపిగా చూచి, "అవ్వ వీటిని మనకు కట్టబెట్టుతున్నదా! సరేలే, ఉండనీ" అంటూ నవ్వాడు. వీటినైనా అంగీకరించినందుకు సంతోషించి, తక్కిన వస్తువులన్నీ పట్టించుకు వెళ్లిపోయింది మీనాదేవి.

ఇక, దైవాధీనం పైకి ముసలివాలకంగా కనపడినప్పటికీ, పడుచువాళ్లను మించి వింత వింత ప్రజ్ఞలూ, విశేషాలూ, ప్రదర్శిస్తూవున్నాడు. ఇందుకు అబ్బురపడి గూడెంలో ప్రజలందరూ అతనికి జేజేలు కొడుతున్నారు. నిజానికి, అతనికి చేతకాని పనే కనబడదు. బొమ్మలు వేయ గలడు, సంగీతం పాడ గలడు, నాట్యం చేయగలడు. ఇలా రోజుకొక ప్రజ్ఞతో ప్రసన్నుడవుతూ, గుణసుందరికీ, గూడెం వాళ్లకూ ఆశ్చర్యం కలిగిస్తూవున్నాడు. ఇదంతా చూచి, ఆమె తన భర్త గొప్ప ప్రజ్ఞాశాలి అనీ, అతనిలో ఉండే రహస్యాన్ని కనిపెట్టాలెననీ ఉత్సాహంతో ఉన్నది.

అక్కడ-మంచంలో పడిన మహారాజు యమయాతన పడుతున్నాడు. కూతుళ్లూ అల్లుళ్లూ అస్తమానం తన ఎదట కన బడుతూ ఉండాలంటాడు. వాళ్లసుఖాలు మానుకుని, కనిపెట్టుకొనివుండి ఉపచారం చేస్తారా ? చేసినా, ఎన్నాళ్లు ? తండ్రే తమ సర్వమూ అని బొంకిన పెద్దకుమార్తెలు ఇద్దరూ తండ్రియెడల దయా దాక్షిణ్యమూ లేకుండా, రాజ్యమెప్పుడు తమకు వస్తుందా అని ఎదురుచూస్తున్నారు.

మహారాజుకు ఆరోజుకారోజు వ్యాధి విషమిస్తున్నది. శస్త్రచికిత్స చేస్తేకాని బతకడని ఆస్థానవైద్యుడు చెప్పాడు. బల వంతముగానైనా సరే, శస్త్రచికిత్స చేయ మన్నారు, రూపా హేమలు. కూతుళ్లను చూచి, "ఇదేనా మీ ప్రేమ ? చూస్తూ చూస్తూ, నన్ను కోయిస్తారా ?" అంటూ మహారాజు గగ్గోలు పెట్టాడు.

(ఇంకా వుంది)






# దేహాభిమానం

పూర్వం గంగానది ఒడ్డున ఒక మునీశ్వరుడు తపస్సుచేసుకుంటూ ఉండేవాడు. ఆయనకు గురుభక్తి గల శిష్యుడు ఉండేవాడు. శిష్యుడిమీద గురువుగారికి అమిత వాత్సల్యం ఉండటంచేత ఎంతో శ్రద్ధగా చదువు చెప్పేవాడు.

ఒకనాడు ఆ ముని శిష్యుణ్ణి పిలిచి, "అబ్బాయీ, నాకు ఈ జన్మ చాలించవలసిన కాలం సమీపించింది" అన్నాడు. ఆమాటకు శిష్యుడు ఉలిక్కిపడి, "ఇదేమిటి మహాత్మా, అప్పుడే నన్ను విడిచి వెళ్లిపోతారా? అలాగైతే మీతోబాటు నాకుకూడా మోక్షం కలిగే ఉపాయం చెప్పండి" అని కోరాడు.

దానికి మునీశ్వరుడు "నాయనా, నాకు మోక్షం కలగటంలేదు. నేనీ జన్మలో ఘోరమైన పాపంఒకటి చేశాను. ఆ మహాపాపానికి ఫలితంగా నేను మళ్లీ జన్మ ఎత్తాలి. జన్మఅంటే మనిషి జన్మకూడా కాదు. పందినై పుట్టాలి!" అన్నాడు.

ఈ మాటలు వినేటప్పటికి శిష్యుడికి నోటమాట రాక, శిలలా నిలబడిపోయాడు.

అప్పుడు ముని, "నువ్వూ నేనూ విచారించి లాభంలేదు. ఎవరైనాసరే, చేసిన పాపానికి ఫలితాన్ని అనుభవించితీరాలి. పందికడుపున నేను పుట్టక తప్పదు. పుడతాను. కాని ఆ నికృష్టజన్మలో ఒక్క క్షణమైనా ఉండడం నాకుఇష్టంలేదు. ఆ జన్మ త్వరగా చాలించుకోవాలంటే నువ్వు నాకు సాయపడాలి" అన్నాడు.

"తమ రేంచెయ్యమంటే అది చేస్తాను" అన్నాడు శిష్యుడు.

"ఐతే విను. అదిగో ఆ కనపడే పల్లె ఉంది చూశావా? అక్కడ ఒక ఎఱుకలవా

పి. సర్వమంగళ, మదరాసు





డున్నాడు. వాడియింట్లో ఒక పంది ఉంది. ఆ పందికి పుట్టబోయే పిల్లలలో నే నొకడినై పుడతాను. ఆపిల్లలలో ఒకదానికి మొహం మీద బొల్లి ఉంటుంది. ఆ బొల్లిపిల్లను నేనే అని నువ్వు పోల్చుకోవాలి. నేను పుట్టీపుట్టడంతోనే నువ్వు ఏమాత్రం సందేహించకుండా నన్ను చంపెయ్యి. ఈ విధంగా ఆ జన్మ నాకు త్వరలో అంతమై పోతుంది" అని గురువుగారు చెప్పారు.

ఈ కోరిక వినేసరికి శిష్యుని కళ్ల వెంబడి నీళ్లు రాలాయి. "మహాత్మా, ఏరూపంలో ఉన్నా మీరు నాకు గురువులే కదా. మిమ్మల్ని నేను చేతులారా ఎలా చంపగలను? నేను అలా ఎన్నటికీ చెయ్యలేను" అన్నాడు.

అందుకు గురువు, "అబ్బే నువ్వలా వెనుదీయకూడదు. ఏమంటె ఈ పని నాకు ఉపకారం చెయ్యటంకోసం గనక హింస అనిపించుకోదు" అని చెప్పి, శిష్యుణ్ణి ఒప్పించాడు.

ఇలా చెప్పి మునీశ్వరుడు ప్రాణాలు విడిచేశాడు. అతడనట్టుగానే ఆ యెఱుకులవాడింట్లో ఉన్న పందికడుపులో ప్రవేశించి పెరుగుతున్నాడు. శిష్యుడు రోజూ ఆ యెఱుకలవాడింటికివెళ్లి వాణ్ణి దీవించి వస్తూండేవాడు.

"బ్రాహ్మణాయన వచ్చి రోజూ నన్ను దీవించి పోతున్నాడెందుకు చెప్మా?" అని వాడు ఆలోచించి ఒకనాడు, "బాబూ, శ్రమపడి రోజూ మా యింటికి ఎందుకు వస్తున్నారు? మీకు నావల్ల అయే పనేమైనా ఉందా?" అని అడిగేడు.

అడగడమే తడవుగా శిష్యుడు, "నీవల్ల నయే ఉపకారం తప్పకుండా ఉన్నది! అందుకనే, నేను రోజూ నీవద్దకు రావటం. ఆ పని యేమిటీ అని అడుగుతావేమో. మీ యింట్లో చూలిపంది ఉన్నది కదా. అది



ఈనేవరకూ దానిని మాయింట కట్టెయ్యాలి దాని పిల్లలలో ఒకదాన్ని నేను పుచ్చుకుని అమ్మవారికి బలిస్తాను. మిగతా పిల్లల్ని తలినీ నీవు తోలి తెచ్చుకోవచ్చును" అన్నాడు.

"ఇంతేకద బాబూ! ఈపాటి పనికే మీరు స్వయంగా మాయింటకి రావాలా? కాకిచేత కబురంపితే, నేనే చేతులు కట్టుకుని మీ దర్శనానికి వద్దునే!" అని ఎఱుకలాడు అంటూ, పందిని తిసుకువెళ్లి ఆ బ్రహ్మచారి దొడ్లో వదలేసి చక్కా వచ్చాడు.




* * *

కొన్నాళ్లు గడిచాక అనుకొన్నట్లుగానే ఆ పంది పిల్లల్ని పెట్టింది. వాటిలో నొసటిపైన తెల్లటి మచ్చగల పాతుపిల్ల భూమిమీద పడ్డంతోటే గురువుగారి ఆజ్ఞప్రకారం దానిని మోదిచంపెయ్యటంకోసం శిష్యుడు దుడ్డుకఱ్ఱను ఎత్తేడు.

కాని నవనవలాడుతూ, ఇంకా కన్ను తెరవని ఆ చిన్నపిల్లని చూచేటప్పటికా బ్రాహ్మణపిల్లవానికి జాలిపుట్టుకొచ్చి "దీన్ని ఎలా చంపటం?" అని మనస్సు వెనుకకు లాగింది. కాస్సేపు అలాగే చూస్తూ నిలబడిపోయాడు.

అంతలో "నువ్వు వెనుదీయకూడదు సుమా" అని గురువుగా రానాడు చెప్పిన మాట జ్ఞాపకంవచ్చి, సంశయం పనికిరాదనుకొని, ఆ పందిపిల్లని బాదబోతూంటే, అది కళ్లుతెరిచి, "ఆగు, ఆగు, చంపకు" అని, మనిషి గొంతుకతో అరిచింది! ఆ వడుగు అట్టే నిలబడిపోయాడు.

అప్పుడు ఆ పందిపిల్లరూపంలో ఉన్న గురువు శిష్యునితో "అబ్బాయీ, నేను భూమిమీద పడ్డంతోనే నన్ను నువ్వు చంపివేయక ఆగేవు. నేను కళ్లు తెరవటంతోనే ఈ శరీరంమీద నాకు అభిమానం కలిగింది. ఈపంది జన్మలో ఉండికూడా సుఖా

లనుభవించవచ్చునని తోస్తున్నది. కనుక ఈ జన్మ కొన్నాళ్ళు గడుపుతాను. నువ్వు ఆలోచించక నీదారిని నువు పో" అన్నాడు.

ఆ మాటలు వినేటప్పటికి శిష్యునికి చాలా ఆశ్చర్యంవేసింది. "ఈ నీచజన్మలో ఒక్క క్షణంకూడా ఉండలేన"ని వాపో యిన గురువే ఇప్పుడిలా అంటున్నాడేమిటి? అని తోచి, "స్వామీ, ఈ నీచజన్మలో మీకు కలిగే సుఖమేమిటి?" అంటూ అడిగేశాడు.

ఆ ప్రశ్నకు పందిపిల్ల, "ఇది నీచజన్మ అని ఇదివరకు అనుకున్నానుగాని ఆ ఉద్దేశం ఇప్పుడు మారిపోయింది. మనిషి శరీరంలో ఉన్నా, జంతు శరీరంలో ఉన్నా, పక్షిశరీరంలో ఉన్నా మరేశరీరంలో ఉన్నా, ప్రాణులన్నింటికీ సుఖదుఃఖాలు సమంగా ఉంటాయి. ఏ జీవికీకూడా తన జన్మ నీచమైన దనిపించదు. ఎంత అల్పమైన జంతు వైనాసరే తన శరీరమంటే అభిమానం కలిగి, ఆశరీరంతో పొందగలిగిన సౌఖ్యాల కోసమే కృషి చేస్తుంది. ఏ ప్రాణికైనా చావు అంటే భయం కలగటానికి కారణం ఈ దేహాభిమానమే" అని పలికింది.

శిష్యుడింకా గురువుగారితో ఏదో మాట్లా డుదా మనుకున్నాడు. ఇంకెక్కడి గురువు? ఆ పందిపిల్లకి మరుక్షణంలోనే తాను పూర్వజన్మలో ఫలానా మునీశ్వరుణ్ణి అనే జ్ఞానం పోయి, ఆ పందిజన్మలో కలిగే కష్ట సుఖాల అనుభవం ప్రారంభమైంది. ఆ బొర్లిపిల్ల తక్కిన పిల్లలతోపాటు తల్లిదగ్గ రకు పోయి, పాలు తాగడం మొదలెట్టింది.

చేసేదిలేక శిష్యుడు, "కర్మఫలాన్ని ఎవరూ తప్పించలేర"ని నిశ్చయించుకొని, ఎఱుకలవాణ్ణి రప్పించి, పందినీ పిల్లల్నీ వాని ఇంటికి తోలిపెట్టేశాడు.






పూర్వకాలమందు పద్మ అని ఒకఅమ్మాయి ఉండేది. పద్మకు చిన్నితమ్ముడు ఒక డున్నాడు. చిన్నతనంలోనే వారికి తలి దండ్రులు పోవటంచేత వారు దిక్కులేని పక్షులైనారు.

అందుచేత ఏ దేశమైనా పోయి హాయిగా బ్రతుకుదామనే ఆలోచనతో వారు భూలోక మంతా చుట్టిరావటానికి బయలుదేరారు.

దారిలో చిన్నితమ్ముడికి దాహమయి, మంచినీళ్లకోసం ఏడిచాడు. 'తమ్ముడూ! కొంచెం దూరంలో బావి కనపడుతుంది. అక్కడ తాగుదుగాని, ఏడవకు' అంటూ వానిని పద్మ ఊరడించింది.

ఇంతలో అతనికి ఒక గుఱ్ఱపుడెక్క ఆనవాలు, అందులో నీళ్లూ కనబడినయి. 'అక్కా, అక్కా! ఇందులో వుండే నీళ్లు తాగి, దాహం తీర్చుకొంటాను' అన్నాడు. 'వద్దు తమ్ముడూ, అవి తాగావంటే గుఱ్ఱపు పిల్లగా మారిపోతావు' అని చెప్పి, తాగ కుండా ఆపుచేసింది.

మరికొంచెం దూరం పోయేవరకు చిన్ని తమ్మునికి ఆవుడెక్క ఆనవాలు, అందులో నీళ్లూ కనబడినయి. 'ఇవయినా తాగుతా' నని అక్కతో చెప్పేవరకు ఆమె ఇప్పుడు కూడా ఆ నీళ్ళు తాగకుండా ఆపుచేసింది.

ఇంకా కొంచెం దూరం పోయేసరికి, మేకడెక్క ఆనవాలు, అందులో నీళ్లు అగ పడినయి. ఇంక దాహానికి ఆగలేక, చిన్ని తమ్ముడు ఈసారి అక్కతో చెప్పకుండానే ఆ మేకడెక్కలాగ ఉండే గోతిలో నీళ్లు తాగివేశాడు.

ఆ నీళ్లు నోటికి తగలగానే చిన్నితమ్ముడు మేకపిల్ల అయిపోయి, మొండితోక ఆడించు కొంటూ గెంతులేయడం మొదలెట్టాడు. పద్మ తన చిన్నితమ్ముడికోసం తెగవెతికింది. ఇంతలో తన చుట్టూ తిరుగులాడుతూ,

వి. సీతారామమూర్తి, బళ్లారి




తనను ప్రేమతో నాకటానికి వచ్చిన చిన్నారి మేకపిల్లను చూసింది. అప్పుడే, ఆ సమీపంలోవున్న మేకడెక్క అనవాలూ, అందులో నీళ్లూకూడా కనబడినై. ఇవన్నీ చూసి, జరిగిన ప్రమాదం గ్రహించింది. చేసేదేముంది? వెక్కి వెక్కి ఏడుస్తూ అక్కడనే కూర్చుంది. ఆమెపక్కనే చిన్నారి మేకపిల్లకూడా వంచిన మెడతో విచారంగా నించున్నది.

కొంతసేపటికి ఒకరాజు ఆ దారిని వచ్చి ఏడుస్తూవున్న పద్మని పలకరించాడు. ఆమె తన సంగతి, మేకపిల్లగా మారిపోయిన తన చిన్నితమ్ముని సంగతి ఆయనతో చెప్పింది.

అప్పుడు రాజు 'నీకు వచ్చిన భయంలేదు. నన్ను పెళ్లాడి నాతో ఉండిపోవలిసింది. నీ కోరికలన్నీ నెరవేరుస్తాను. నీ చిన్ని తమ్ముణ్ణి జాగ్రత్తగా కాపాడే భారం నాది' అంటూ ధైర్యం చెప్పాడు.

చిన్నారి మేకపిల్లను వెంటబెట్టుకొని పద్మ ఆ రాజుతో వెళ్లిపోయింది. ఆయన పద్మను తన రాణిగా చేసుకొని, ఎంతో అభిమానంగా చూచుకొంటూ వున్నాడు.

ఇలా ఉండగా, పద్మ వచ్చి హాయిగా వుంటున్న సంగతి ఒంటికంటి రాకాసికి ఎలాగో తెలిసింది. ఎవళ్లయినా సుఖంగా ఉన్నారంటే వాళ్లని నాశనం చేయటమే ఈ రాకాసి పని.

ఒకరోజున రాజు ప్రియమైన తన పద్మకి అపురూపమయిన వస్తువు తీసుకువద్దామనే ఉద్దేశంతో రాజ్యందాటి వెళ్లాడు. ఆ సమయంలో రాకాసి పద్మవద్దకు పెద్దమనిషిలాగ వచ్చి 'కడుపు మండిపోతున్నదితల్లీ! కాస్త కబళం పెట్టించండి' అని బతిమాలింది. జాలిగుండెగల పద్మ అలాగే అని చెప్పి భోజనం పెట్టించింది. కూర్చున్నట్టే కూర్చుని రాకాసి, పద్మ ఉపయోగించే మంచినీళ్లపాత్రలో ఆమె చూడకుండా

మందు కలిపివేసింది. ఆ నీళ్ళు తాగేసరికి, పద్మకు హఠాత్తుగా జబ్బుచేసి, భర్త తిరిగి వచ్చేలోగా నీరసించిపోయింది.

మరునాడు రాకాసి ఒక మందులదాని రూపంతో వచ్చి, పద్మను చూచి జాలిపడి నట్టు నటించి, తను ఇచ్చే మందు రాచు కుని ఏటిలో స్నానంచేసినట్లైతే మామూలు రూపం వచ్చేస్తుంది అని చెప్పింది.

అమాయకురాలయిన పద్మ ఆ ప్రకారమే మరునాడు ఏటికి వెళ్లేదరకు దుర్మార్గురాలైన రాకాసి, పద్మబట్టలను తను చేత పుచ్చుకొని, అమెను దిగి స్నానం చేయుమన్నది. పద్మ స్నానం చేస్తూవుండగా రాకాసి, పద్మ మెడకు ఒక పెద్ద రాతి బండను వేలాడవేసి అమెను ఏటి అడుక్కి దింపివేసింది. రాకాసి చర్యలన్నీ పద్మ వెంటనున్న మేకపిల్ల గమనిస్తూనేవుంది.

రాకాసిచేతిలో పద్మ బట్టలు చిక్కుకొని పోయినై. పోతే, పద్మ ఏటి అడుక్కి పోనే పోయింది. కనుక, ఈ అదును చూచుకొని రాకాసి, ఆ దుస్తులు తను వేసుకుని, తన మంత్రశక్తివల్ల సరిగ్గా పద్మలాగానే తయారయి కోటలో ప్రవేశించి మామూలుగా రాణీలాగనే మసులుతూవుంది.




సాయంకాలానికి రాజు ఇంటికి వచ్చి తన భార్య ఎప్పటివలె సరదాగా ఉండటం చూసి, సంతోషించాడు. చిన్నారి మేక పిల్లమాత్రం రోజూ ఉదయాన, సాయంత్రమూ ఏటిఒడ్డుకు పోయి, 'బా!బా!!...' అని విచారంగా అరుస్తూ వుండేది.

మేకపిల్ల అలా ఏటి ఒడ్డుకి వెళుతూ వుండటం రాకాసి కనిపెట్టి, తన గుట్టు బయలుపడుతుందేమోనని భయపడింది. అందుకని ఎలా అయినా దీనిని చంపివేస్తే, పీడ వదులుతుందనుకొని, వంటవానిని పిలిచి మేకపిల్లను వండేసెయ్యమని ఆజ్ఞాపించింది.

ఈ మాట విని, రాజు "ఈమేకపిల్ల నీ ప్రియమైన తమ్ముడు కదా! తమ్ముడిని చంపమంటావేమిటి?" అని ఆశ్చర్యంతో అడిగాడు.

అందుకు సరిగా బదులు చెప్పలేక రాకాసి 'తమ్ముడేమిటి, గిమ్ముడేమిటి? నాకు అలా బుద్ధి పుట్టింది. అందుచేత వాడిని వండుకు తినేయవలిసిందే' అన్నది.

ఈ మాటలు వినగానే చిన్నారి మేకపిల్ల ఏటి ఒడ్డుకు పరుగెత్తిపోయి,

"అక్కా! పద్మా!! —
నను చంపెదరట, నను వండెదరట
కత్తులు నూరిరి, కోలలు కాల్చిరి"

అంటూ చెప్పుకొని ఏడ్చింది.

అప్పుడు ఏటిఅడుగునించి పద్మ జాలిగా తన చరిత్ర చెప్పింది. రాణీ ఆజ్ఞప్రకారం మేకపిల్లను పట్టటానికి వచ్చిన నౌకరుకు ఏటి అడుగునుంచి వచ్చిన మాటలన్నీ స్పష్టంగా వినపడేవరకు, వాడుపోయి రాజు గారితో చెప్పాడు. రాజు స్వయంగా ఏటి ఒడ్డుకువచ్చాడు. మేకపిల్ల మళ్లీ ఏడిచింది. ఏటి అడుగునించి పద్మ మళ్లీ జవాబు చెప్పింది. ఆ మాట తన పద్మదేనని కంఠస్వరాన్నిబట్టి వెంటనే రాజు గుర్తించాడు.

తక్షణమే జాలరివాళ్లను పిలిపించి పట్టు వలలు వేసి ఏటిలో వెతకమన్నారు. కొంత సేపటికి పద్మ ఆ వలలో చిక్కుకొన్నది.

తెలివి రాగానే పద్మ చిన్నారి మేకపిల్లను దగ్గరకు తీసుకుని కౌగిలించుకున్నది. ఆమె తాకినవెంటనే నీటి మహిమవల్ల మేకపిల్లకు తన చిన్నితమ్ముని రూపం వచ్చేసింది. రాజు ఇంటికి చేరుకొని నిజానిజాలు తెలుసుకొన్నాడు. రాణీరూపంలో వున్న ఒంటికంటిరాకాసిని విరిచికట్టించి ముక్కముక్కలుగా కోయించి, ఉప్పుపాతర వేయించారు. అప్పటినించీ పద్మా, తమ్ముడూ హాయిగా వుంటున్నారు.






అనగనగా కిట్టు అని ఒక కుర్రవాడు ఉండేవాడు. వాడు చూపులకు చిన్నవాడే గాని, చేసే పనులన్నీ వింతగా పరిణమించేవి. ఒకప్పుడు అతను మిరపగింజలు పాతిపెట్టాడు. అదేమి చిత్రమోగాని, అవి మిరపకాయలకు బదులు తియ్యటిఫలాలు పండినై. కిట్టుని చూస్తే పిల్లలకూ పెద్దలకూ అందరకూ ఆనందమే. అందుకనే అందరూ అతనిని 'కిట్టుమామా! కిట్టుమామా!!' అని పిలిచేవారు.

కిట్టుమామకు ఈ పని చేతనవును, ఇది చేతకాదు అన్నమాట లేదు. ఎవరికి ఏపని కావలిసినా, చేసిపెట్టేవాడు. అంత మంచివాడు కిట్టుమామ.

ఇన్ని పనులు చక్కబెట్టినా, అతని చేతిలో డబ్బు నిలిచేదికాదు. డబ్బు లేకపోయినా, ఎప్పుడూ సరదాగానే ఉండేవాడు. కిట్టుమామ చుట్టూ, ఎప్పుడు చూచినా పిల్లలు, పిల్లులు, కుక్కలూ మొదలయిన నేస్తాలు గుమిగూడి వుంటారు. అంతేకాని, అతను ఒంటిపాటుగా కనపడడు.

ఒకరోజున కిట్టుమామ, కలప నరకడానికి అడవికి వెళ్లాడు. ఒక్కచెట్టు నరికే వరకు మధ్యాహ్నమైపోయి, ఆకలివేసింది. మానుమీద కూర్చుని, కిట్టుమామ ఫలహారం తినటం ప్రారంభించేసరికి, అడవి పక్షులు వచ్చి వాలాయి. చెవులపిల్లులు తొంగిచూచాయి. లేదనకుండా, అన్నింటికీ రొట్టెముక్కలు రాల్చాడు. అవి ఆముక్కలు తినేసి, సంతోషంతో వెళ్లిపోయినయి.

అవి వెళ్లిపోగానే కిట్టుమామ ఎదట ఆకస్మికంగా, ఒక అందమైన భవనము, చుట్టూ చక్కటి తోట కనపడినై. భవన ద్వారంమీద నల్లపిల్లి కూర్చునివుంది.

ఆశ్చర్యంతో కిట్టుమామ అక్కడికి వెళ్లేసరకు, తలుపు తీసుకొని ఒక వృద్ధు

జి. రత్నప్రభ, హిందూపురం



రాలు ఇవతలకు వచ్చింది. "అబ్బాయీ, అబ్బాయీ! నీదగ్గిర మంచి గొడ్డలి ఉన్నట్టుంది. నాకు కాసిన్ని కట్టెలు కొట్టిపెడతావా" అని అడిగింది. దానికి కిట్టుమామ "అలాగే అవ్వా! పెద్దవాళ్లకు సేవ చేయడంకంటే కావలిసిందేముంది" అని చెప్పి, అవ్వ చూపిన కట్టెలన్నీ చకచక కొట్టేసి, ముచ్చటగా వాటిని పేర్చి, అడగ్గిరే వున్న చీపురుతో చుట్టూతా రాలిన ఎండుటాకులు అన్నీ తుడిచి పారబోశాడు.

అతని శ్రద్ధకూ, భక్తికీ అవ్వ సంతోషించి, "నాయనా! చెప్పిన పని చక్కగా చేసిపెట్టావు. నీ కష్టానికి ఏమి కావాలో కోరుకో" అన్నది. "నేను పడిన కష్టమేమీ లేదు నీ చలవచేతితో గుక్కెడు మంచి నీళ్లు ఇస్తే చాలు" అన్నాడు కిట్టుమామ.

వృద్ధురాలు కిట్టుని లోపలకు రమ్మంది. అతను మర్యాదకోసం కాలిజోళ్ళు విప్పి బయట వదిలి, లోపలకు వెళ్లేసరికి, లోటాతో తియ్యటి పాలు తెచ్చి ఇచ్చింది. "అబ్బాయీ! నిన్నూ, నీ గుణాలనూ చూడగా నాకు సంతోషమయింది. నిన్ను ఆశీర్వదించి ఒక బహుమతి నీకు ఈయ దలచాను. కనుక, ఈ భవనంలో కనపడే వాటిల్లో ఏది కావాలో కోరుకో" అన్నది.

నాలుగుదిక్కులూ చూచి, కిట్టుమామ ఒకమూలనున్న పడక కుర్చీమీద దృష్టి నిగిడించాడు. అవ్వ, అతని మనసులో కుతూహలాన్ని గ్రహించి, "అబ్బాయీ! నేను ఏదైతే నీకు ఇద్దామనుకుంటున్నానో, సరిగా అవస్తువుపైనే నీ దృష్టిపడింది. ఇది మహిమగల కుర్చీ. దీనిని పట్టుకు వెళ్ళు. దీనివల్ల నీకు అదృష్టం పడుతుంది, కీర్తి వస్తుంది" అని చెప్పింది.

కిట్టుమామ వృద్ధురాలికి నమస్కరించి, కుర్చీ బుజంమీద వేసుకొని, వెనుక వెనుకకు చూచుకొంటూ పోతున్నాడు. కాని,

అతను చూస్తూవుండగానే, ఆ భవనమూ, తోటా అదృశ్యమైపోయినై.

కిట్టుమామ ఇంటికి చేరుకొని, కుర్చీలో హాయిగా కూర్చోవచ్చు కదా అని ఉవ్విళ్ళూరుతున్నాడు. ఆ కుర్చీని శుభ్రంగా తుడిచి, ఒక మంచి స్థలంలో అమర్చి, సిద్ధంచేసేటంతలో, అతని ప్రాణస్నేహితుడైన సీను వచ్చాడు. కిట్టు ఇంటికి సీను ప్రతి అదివారం తప్పకుండా వస్తాడు. అలాగే ఇవాళ కూడా వచ్చాడు. సీను పాపం, గ్రుడ్డివాడు. అతనిని ఎవ్వరూ చేరదీయరు. కాని కిట్టు మాత్రం సీనుని ప్రాణపదంగా చూసుకుంటాడు.

అందుచేత, సీను రాగానే కిట్టు, ఆరోజున జరిగిన చిత్రాలన్నీ చెప్పి, తను సంపాయించుకువచ్చిన కుర్చీలో అతనిని కూర్చొబెట్టాడు.

సీను అ కుర్చీలో కూచుని, కొంచెం సేపు అటూ ఇటూ ఊగేవరకు, చిన్నరాగం తీయడం ప్రారంభించాడు. అది క్రమంగా పెద్దదై హెచ్చుస్థాయిలో కృతులు పాడటం మొదలెట్టాడు. అపాటలు అద్భుతంగానూ, హాయిగానూ ఉండటంచేత, కిట్టుమామ అలాగే నిశ్చేష్టుడై, వింటూ కూచున్నాడు.




మధ్యాహ్నం రెండుజాములయేవరకు, సీను పాడె పాట నిలిచిపోయింది. అతను కుర్చీలోనించి లేచాడు, లేవగానే, సీనుకి కలకాంచినట్లు అనిపించింది. "సీనూ! ఇన్నాళ్లనించి స్నేహంగా ఉంటున్నాం కదా. ఇంత చక్కటి పాట వచ్చునని ఎన్నడూ చెప్పావుకాదుకద!" అని కిట్టుమామ ప్రశ్నించాడు. అందుకు సీను "నిజంగానే నాకు సంగీతంరాదు కిట్టూ! ఇప్పుడు ఎలా పాడగలిగానో నామట్టుకి నాకే ఆశ్చర్యంగా వున్నది" అన్నాడు.

ఈ విధంగా ప్రతి అదివారమూ సీను వచ్చి ఆ కుర్చీలో కూచుని, గంధర్వ



గానాన్ని మించిన సంగీతం పాడేవాడు. మధ్యాహ్నం రెండుజాములకు ఆ సంగీతం నిలిచిపోయేది. ఈ పద్ధతిలో జరుగుతూ వున్న సంగీతానికి కిట్టుమామ తన్మయుడైనాడు. సీనుమీద అతని అభిమానం ఎంతవరకూ పోయిందంటే 'ఇది సీను కుర్చీ దీనిలో అతనుతప్ప మరెవ్వరూ కూచోకూడదు. నేనైనా సరే అందులో కూర్చో'నని నియామకం చేసుకొన్నాడు.

సీను పాడగలడనే సంగతి అతనికీ కిట్టుకి తప్ప మూడోవాడికి తెలియదు. కుర్చీలో కూర్చున్నప్పుడు గాక, ఇతరసమయాలలో అలాగే పాడుదామని సీను ఎంతో ప్రయత్నించాడు. ఎంత ప్రయత్నించినా, వెర్రి మొర్రి కూతలు మాత్రమే కంఠంలోంచి వచ్చేవి.

ఇలా వుండగా—

ఆ రాజ్యం ఏలే రాజుకి జబ్బుచేసింది. తిండి నోటికిపోవటం లేదు. కంటికి కునుకు రావటంలేదు. ఎప్పుడు చూచినా విచారంగా ఉండేవాడు. దర్బారులో వుండే హాస్యచతురులందరూ వచ్చి, రాజును నవ్వించుదామని శాయశక్తులా ప్రయత్నించారు. కాని, వాళ్ళవల్ల కాలేదు.

ఘన వైద్యులందరూ వచ్చి చూచి, 'ఇదేమీ శరీరసంబంధమైన జబ్బుకాదు. వింతవస్తువు ఏదైనాచూపిస్తే, మతి కుదుటబడుతుంది' అన్నారు.

వారి సలహాప్రకారం, కోటలోని పరివారమంతా వింతవస్తువు తేవటానికని దేశాలవెంబడి బయల్దేరారు. ఒకొక్కడు ఒకొక్క అపురూపమైన వస్తువు తీసుకువచ్చారు. కాని అందులో ఒక్కటీ రాజుగారికి పని చేయలేదు.

పరివారంలో ఒకడైన 'వేణు' రాజభక్తిపరాయణుడు. వాడు తిరిగి తిరిగి కిట్టుమామ ఇంటి సమీపానికి వచ్చేసరికి, ఆ

సమయంలో సీను గానం చేస్తూవున్నాడు, వేణుసిశ్శ్రేష్ఠుడై, ఆ గానం వినేసరికి, అతని శరీరంలో బాధలన్నీ తొలగిపోయి, కొత్త ఉత్సాహం ప్రవేశించింది వెంటనే కోటకు చేరుకుని, ఈ సంగతి రాజుతో చెప్పగానే, ఆ చిత్రమైన పాటగాడెవరో, వాడిని వెంట బెట్టుకు రమ్మని రాజు అజ్ఞాపించాడు.

వేణు కిట్టుమామ కుటీరానికి వెళ్ళి, వాళ్ళిద్దరనూ రాజువద్దకు రమ్మని పట్టు పట్టాడు. "మాకు ఏవిధమైన సంగీతమూ రాదు'' అని వారు గోలపెట్టారు. వాళ్ళు సిగ్గుపడుతున్నారనుకుని, వేణు, "మీరు గొప్ప విద్వాంసులైవుండీ, ఎందుకు జంకుతారు? రాజుగారు మీ పాటవిని, మెచ్చుకొని, బహుమతులిస్తారు. ఆయనకు సంతోషం కలిగిందంటె మిమ్మల్ని ఆస్థానంలో మంత్రులుగా కూడా పెట్టుకోగలరు" అంటూ ప్రోత్సహించాడు.

చివరకు ఎలా అయితేనేం, సీనుని తీసుకుపోయి, రాజుఎదుట పెట్టాడు. ఒక్క పాట పాడుమని రాజు స్వయంగా సీనుని కోరాడు. సీను గొంతు సవరించుకొని, పాడబోయాడు కాని, కంఠంలోనించి కెర్రిమొర్రి కూతలు మాత్రమే వచ్చాయి.



ఈవిద్వాంసుడు గర్విష్ఠివలె ఉన్నాడు, తనను చూచి హేళన చేస్తున్నాడు అని తలచి. రాజు అతనిని ఖైదులో వేయించాడు.

సీను ఖైదులో పడ్డాడేగాని, రాజు పరిస్థితి ఏమీ మారలేదు. ఏమైనాసరే, వింత వస్తువుకోసం మళ్లీ పోయిరావాలని చెప్పి, వేణు బయల్దేరాడు. పోయి పోయి అడవి చేరుకొనేవరకు, అక్కడ, సరీగా కిట్టుమామ చూచిన మోస్తరుదే భవనమూ, తోటా వేణుకి కనపడినై.

వేణు గుమ్మం ఎక్కేసరికి, తలుపు తెరచుకుని వృద్ధురాలు ఇవతలికివచ్చింది, అప్పుడు అతను "అవ్వా, అవ్వా! మా



రాజు జబ్బు నయంకావటానికి ఏదైనా వింతవస్తువు ఇవ్వగలవా?" అని అడిగాడు. అందుకు ఆమె "పోవోయి పక్షీ!— నువ్వూ మీ రాజూ వట్టి శుంఠలు. మీకేం కావాలో మీకేతెలియదు, ఎదట వున్న వస్తువునే కంటితో చూచి కనుక్కోలేరు; ఫో ఫో" అంటూ కసిరికొట్టి తలుపు మూసికొన్నది.

'ఈ అవ్వ పొగరుబోతులాగా ఉన్నది. లేకపోతే ఇటువంటి మాట లేమిటి?' అని వేణు మనస్సులో అనుకొని, మళ్లీ చూచేసరికి అవ్వాలేదు, భవనమూలేదు. వేణుకి కంగారుపుట్టి. కాళ్ళు ఎక్కడికి తీసుకుపోతే అక్కడికీ బయల్దేరి పోయాడు.

వేణు పోయిపోయి, చివరకు మళ్లీ కిట్టుమామ కుటీరానికి చేరుకొన్నాడు. తన ప్రాణస్నేహితుడైన సీను సంగతి ఏమిటని కిట్టుమామ అడిగేసరికి, అతను ఖైదులో వున్నట్టు చెప్పాడు వేణు. కిట్టుమామ చాలా విచారించి, "సరే, అయినదానికి ఏమి చేయగలం? ముందు సంగతి ఆలోచిద్దాం. అలా స్తిమితంగా కూర్చోండి" అంటూ, వేణుని పడకకుర్చీలో కూర్చోబెట్టాడు.

కుర్చీలో కూర్చొని ఒక్క నిమిషం అటూ ఇటూ ఊగిన తరువాత, వేణు చిన్న కూనరాగం ప్రారంభించాడు. క్రమంగా కూనరాగం పెద్దదై, హెచ్చుస్థాయిలో కృతులు పాడటం మొదలెట్టాడు. ఆ పాట సరీగా తన మిత్రుడు సీను పాడిన పాటే కావడంచేత, వేణు తనను వేళాకోళం చేస్తున్నాడనుకొని, కిట్టుమామ ఆతనిని జబ్బపట్టుకుని ఇవతలకు లాగివేశాడు.

స-రి-గ-మ-లైనా నోటపట్టని తనకు, ఇంత చక్కటి పాట చేతనైనందుకు వేణు ఆశ్చర్యపోయాడు. ఈ వింతవల్ల తప్పక తన రాజుకి నయమవుతుందని నిశ్చయం తోచింది. వేణు కోటకు పోబోతూవుండగా, 'రాజుతో చెప్పి మా సీనుని విడిపించు

కుంటా 'నని చెప్పి, కిట్టుమామ కూడా అతని వెంట బయల్దేరాడు.

వేణు కోటకు చేరుకొనేసరికి, రాజు మునుపటికంటె ఎక్కువ విచారంగా కనపడ్డాడు. అప్పుడు వేణు "ప్రభూ!—నాకిప్పుడు అమరగానం చేయగల శక్తి కలిగింది. ఆ గానం విన్నారంటే మీకున్నటువంటి మనోవిచారం నిమిషంలో తొలగిపోతుంది. చూడండి చిత్రం!' అంటూ, గొంతు సవరించుకొని పాటపాడటం మొదలెట్టాడు. అతను ఎంత ఆరాటపడినా, కంఠంలోంచి వెర్రిమొర్రికూతలు మాత్రం వెలువడ్డాయి.

లోగడ, విద్వాంసుడనుకొని భ్రమపడి రప్పించిన సీను—స్వయంగా రాజు బ్రతిమాలినప్పటికీ—వెక్కిరించినట్టు వేళాకోళపు కూతలు కూశాడు. ఇప్పుడు మళ్లీ తనకు నమ్మినబంటు అయినటువంటి వేణుయే తనను హేళన చేశాడు!—ఈ సందర్భాలు రాజుకి ఏమీ అర్థంగాక, "ఈసారి నేను పాడగలను అనిచెప్పి ఎవడైనాసరే ఎదటికి వచ్చి నిలబడనీ, డొక్క చీల్చి డోలు కడతాను" అని రాజు మండిపడుతూ వేణుని హెచ్చరించాడు.



ఆరోజుననే రాజుకి ఒక కల వచ్చింది: వృద్ధురాలి రూపంలో వున్న దేవకన్య కనబడి "ఏమోయి రాజా! గుడ్డివాళ్ళు, కుంటివాళ్ళు, పసిపిల్లలు దేవతలకు మిత్రులన్న సంగతి మరిచావా? నిరపరాధి ఐన మా మిత్రుడు సీనుని ఎందుకు నిర్బంధంలో ఉంచావు? నీ సేవకుడు వేణు మాదేవతల మహిమను భగ్నంచేస్తూవుంటే అలా నీవు ఊరుకోవలసిందేనా? నీతప్పు తెలుసుకో. తెలుసుకొని సవరించుకో..." అని గద్దించి చెప్పి, అదృశ్యమైపోయింది.

రాజు వెంటనే సీనుని విడిచిపెట్టి పరివారముతో అడవికి వెళ్లాడు. అక్కడ

భవనము, తోట, ద్వారం మీద నల్లపిల్లి కనపడినై. రాజు సరాసరి భవనంలోపలకు పోయేవరకు, బల్లమీద ఒక చీటి ఉన్నది. ఆ చీటిలో "వృద్ధురాలు వెళ్లిపోయింది. మళ్ళీ రేపే దర్శనం" అని వ్రాసివున్నది.

సరే, రేపు మళ్లీ రావచ్చుకదా అనుకొని రాజు ఇంటికి బయల్దేరాడు. దోవలో అయనకు కిట్టుమామ కుటీరం తగిలి, అక్కడ అమరగానం హాయిగా వినిపించింది. సరాసరి ఆయన ఎంతో ఆనందంతో లోపలకు వెళ్లేసరికి, రాజుగారే స్వయంగా తన కుటీరానికి వచ్చారన్న సంతోషంతో కిట్టుమామ రాజుగారిని ఆ కుర్చీలో కూర్చోబెట్టాడు.

కూర్చున్న కొంచెంసేపటికే రాజు చిన్న కూనరాగం ప్రారంభించాడు. క్రమంగా అది పెద్దదై, హెచ్చుస్థాయిలో కృతులు పాడటం మొదలెట్టాడు. ఇప్పుడు ఆయన ఏబాధా లేక. హాయిగా కనబడ్డాడు.

అమట్టున కిట్టుమామ ఉత్సాహంతో ఎగిరి గంతేసి, "సీనూ! నువు పాడావు, వేణు పాడాడు. అదేపాట ఇప్పుడు రాజుగారు పాడుతూవున్నారు. ఈ గమ్మత్తంతా కుర్చీలోనే వున్నది. నాకు ఆ వృద్ధురాలు దీనిని ఇచ్చినప్పుడే "ఇది మహిమగల కుర్చీ అని చెప్పింది" అన్నాడు.

అప్పుడు ఆకాశవాణి "ఈ పాటిరహస్యం తెలుసుకోవటానికి ఇంతకాలం పట్టిందా?" అంటూ పకపక నవ్వింది.

"సరి, సరి. నా తప్పు నేను తెలుసుకొన్నాను" అన్నాడు రాజు. మహిమగల ఆ సంగీతపు కుర్చీని, దానితోపాటు సీనునీ, కిట్టుమామను రాజు తనవెంట తీసుకుపోయాడు. కుర్చీని కోటలో మంచి చోట అమర్చి, నాటినుంచి సీను, కిట్టులను ఆయన తన ఆస్థానమంత్రులుగా నియమించుకొన్నాడు.





# కాళహస్తి

పూర్వకాలమందు ఒక అడవిలో ఒకచోట శివుడు లింగరూపంలో వెలిశాడు. రాత్రి వేళ ఆ అడవిలో తిరిగే సర్పరాజు శివభక్తుడు. అందుచేత, ఆ లింగాన్ని చూసిన తరువాత రోజూ రాత్రి అక్కడకు వచ్చి, ఆ లింగానికి పూజచేసిపోవాలని నిశ్చయించుకున్నాడు. పాములదగ్గర విలువయిన మణులన్నీ ఉంటాయి. మణులంటే వాటి కెంతో ప్రీతి. ఆ నాగరాజు తన పుట్టలోకి వెళ్లి తనవద్ద ఉన్న మరకత మాణిక్యాలూ, వజ్రవైడూర్యాలూ, కెంపులూ, పచ్చలూ, నీలాలూ, పుష్యరాగాలూ— ఒకటేమిటి? అన్నిరకాల మణులూ తెచ్చి. ఆ లింగం మీద పెట్టి భక్తితో పూజచేసి వెళ్లిపోయాడు.

ఆ అడవిలోనే పెద్ద ఏనుగకూడ ఒకటి ఉన్నది. ఆ అడవిలోని ఏనుగు లన్నింటికీ అది రాజు. సర్పరాజు పూజచేసి వెళ్లిన మర్నాడు గజరాజు ఆ దారినివచ్చి, లింగాన్ని చూశాడు. గజరాజుకూడా గొప్ప శివభక్తుడే. శివలింగం కనపడగానే ముంగాళ్లు వంచి, తొండం ఎత్తి మ్రొక్కుకున్నాడు. లింగంమీద ఉన్న మణులను చూసి చీదరించుకున్నాడు. మణులంటే పాముకి గొప్ప గాని ఏనుగ కేమి గొప్ప? "ఎవడు చెప్మా ఈ దుర్మార్గుడు? పరమేశ్వరునిమీదనే రాళ్ళూ. రప్పలూ పడవేసి పోతాడా!" అని తలచి, గజరాజు ఆ మణుల్ని తొండంతో విసిరి పారవేశాడు.

మణులుంచివెళ్లిన నాగరాజుకూడా తనకుమల్లేనే మహాభక్తుడనీ, ఎంతో భక్తితో ఆ మణులను లింగానికి పూజచేసి వెళ్లేడనీ గజరాజు కేంతెలుసు? ఆ మణులన్నీ ఉత్త రాళ్ళూ, రప్పలున్నూ. అటువంటివి పరమేశ్వరుని సన్నిధిలో ఉండ తగవనీ గజరాజు ఉద్దేశం. అందుకే వాటిని దూరంగా విసిరేశాడు.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మద్రాసు



ఉండి, పరమేశ్వరునిమీద ఆకూ అలమూ, చెత్తా చెదారమూ కనపడినై. గజరాజు భక్తిశ్రద్ధలతో పెట్టివెళ్లిన ఆ పత్రీ పువ్వులు నాగరాజుకి "తీగలూ, ముళ్లకంపలూ" అనిపించాయి. "నా పూజ పాడుచేసి, దేవుడికిలా అపకారం చేసిపోయిన ఆ దుర్మార్గు డెవడైయుంటాడు?" అని ఆలోచిస్తూ, సర్పరాజు ఏనుగుపెట్టి వెళ్లిన పత్రీ, పువ్వులూ తీసి దూరంగా తోసివేసి, తాను తెచ్చిన మణులతో మళ్లీ శివలింగానికి పూజచేసి వెళ్లిపోయాడు.

మర్నాడు గజరాజు తొలినాటికి మల్లేనే పత్రీ, పువ్వులూ పుచ్చుకుని శివలింగం దగ్గరకు వచ్చాడు. చూసేటప్పటికి లింగం మీద తాను పెట్టివెళ్లిన పత్రి అక్కడలేదు. దానిస్థానే మళ్లీ రాళ్లూ, రప్పలూ ప్రత్యక్షమైనయి. "ఆ రాళ్లరప్పల వాడెవడో మళ్లీ వచ్చాడన్నమాట! నేనా రాళ్ళనోమాటు తీసి పారేస్తే నోరుమూసుకు పోక, 'తగుదునమ్మా అని నా పత్రినీ, పువ్వులనూ తోసేస్తాడా" అంటూ నాగరాజు పెట్టిన మణులన్నీ దూరంగా విసిరేసి, గజరాజు తాను తెచ్చిన పత్రితోనూ పువ్వులతోనూ లింగానికి పూజచేసి వెళ్లిపోయాడు.

పాములకు మణులంటే ఇష్టమైనట్లే, ఏనుగులకు పత్రిమీదా, పువ్వులమీదా ప్రీతి. గజరాజు గబగబా వెళ్లి అడవంతా తిరిగి మోపెడు బిల్వపత్రి విరుచుకువచ్చాడు. కొలనులో దిగి తామరతూళ్ళూ, పువ్వులూ తుంపుకొని వచ్చాడు. అవన్నీ తెచ్చి, శివలింగానికి పూజచేసి తనమానాన తను వెళ్లిపోయాడు.

రెండోరాత్రి నాగరాజు కొత్తకొత్త మణులెన్నో సంపాదించితెచ్చి, పూజచేసుకుందామని శివలింగంవద్దకు వచ్చాడు. చూస్తే ఏముంది? తాను ముందురాత్రి పెట్టివెళ్లిన మణులన్నీ చిందరవందరగా విసరబడి

మూడో రాత్రి నాగరాజు మామూలు ప్రకారం మణులతో శివలింగం దగ్గరకు వచ్చి, తనపూజ భగ్నమై ఉండడమూ, దేవుని మీద మళ్లీ ఆకూ అలమూ కప్పిఉండడమూ చూచి దుఃఖమూ, కోపమూ ఆగలేదు. శివునికేసి దీనంగా చూస్తూ, "స్వామీ. నేనెంతో భక్తితో నవరత్నాలు తెచ్చి పూజ చేసి వెడుతూంటే, దుర్మార్గు డెవడో రోజూ నా పూజ నాశనం చేసి, నీమీద ముళ్ళ కంపలు పెట్టి పోతున్నాడే. నీ మూడవ కన్నుతెరిచి వాణ్ణి హతమార్చెయ్యాలి కాని ఇలా చూస్తూ ఊరుకోవటమేవా? అయ్యో, ఎంత తెలివి తక్కువవాణ్ణి! పరమేశ్వరుడవు నీకు చేతకాకపోవడమేమిటి? చేతనయే ఊరుకున్నావు! భక్తుడనైన నన్ను వదిలేవి, నాశత్రువైన ఆ దుర్మార్గుడి పక్షం చేరిపోయి, వాడు ముళ్ళకంపలు పెట్టినా ఊరుకుంటున్నావు! నువ్విలా పరాయి పక్షంలో చేరిపోడానికి నేనుచేసిన అపరాధం ఏమిటి స్వామీ?" అంటూ దుఃఖించాడు. ఆఖరికి మనస్సు కుదుట పరుచుకుని మళ్లీ అపత్రి నంతటినీ నెట్టివేసి లింగంమీద ఉన్న దుమ్మునంతా బుస్సుమని ఊది స్థలం శుభ్రంచేసి, తానుతెచ్చిన



మణులతో పూజచేసి, వెళ్లేడు. వెళ్లేడన్న మాటేకాని, ఆరాత్రి నాగరాజుకు నిద్రపట్ట లేదు. "నా పూజ పాడుచేస్తూ వుంట ఎవరు? వాడి పని పట్టడం ఎలాగ?" అనే ఆలోచనలతో అతడు రాత్రంతా జాగరం చేశాడు.

తర్వాత మామూలుప్రకారం శివలింగం దగ్గరకు ఏనుగొచ్చింది. తన పత్రి పోయి, శివలింగంమీద మళ్లీ రాళ్లు కప్పిఉండడం చూచింది. ఏనుగకు వళ్లు మండిపోయి "నాతో పేచీ తెచ్చుకుంటూన్న ఈ మూర్ఖుడెవడు?। వాడు మూర్ఖుడైతే కావచ్చుగాని, వాడు వేసే ఈరాళ్లు నీ కెలా నచ్చాయి?



స్వామీ, ఈ నీలాలు నా నల్లకలువలకు సాటివస్తయా? ఈ పచ్చలు నా బిల్వపత్రాలతో పోలుతవా? ఈ కెంపులు నేను తెచ్చిసమర్పిస్తూన్న ఎర్ర తామర పుష్పాల ముందు ఎందుకు పనికివస్తాయి? నేను తెచ్చిపెడుతూన్న పువ్వులలోనూ, పత్రిలోనూ ఉండే మృదుత్వంగాని, చల్లదనంగాని, పరిమళంగాని ఈ కరకు రాళ్ళల్లో ఎక్కడున్నవయ్యా?" అని ప్రశ్నలు కురిపించాడు. "ఈవేళకూడా ఈరాళ్లు అవతల పారేసి మామూలుప్రకారం పూజచేసుకొని పోతాను. రేవుకూడా ఈ పూజగనక పాడైపోయి వున్నదా, వాడిపని పట్టితీరతాను!" అని నిశ్చయించుకుని, పూజ పూర్తిచేసి వెళ్లిపోయాడు. మనసుకి పట్టి పీడిస్తూవున్న కోపం మూలాన్ని గజరాజుకుకూడా ఆ రాత్రి నిద్ర పట్టలేదు.

గజరాజు వెళ్లిపోయాక నాగరాజు శివలింగంవద్దకు వచ్చాడు. మళ్లీ తనపూజ భగ్నమైపోయి ఉండడం చూచి, మండిపడ్డాడు. "ఈ దుర్మార్గు డెవరో వాలాయించి నన్ను పరాభవిస్తున్నాడు. కనుక, ఇక్కడనే పొంచివుండి, వాడినిపట్టి పల్లారిస్తేగాని నేను ఇంటికిపోను ఇదే నా శపథం." అని నిశ్చయం చేసుకున్నాడు. ఏనుగ పెట్టి వెళ్ళిన పత్రిని ఇదివరకుమల్లే ఈసారి తోసి పారవేయలేదు. మెల్లిగా ఆ పత్రిలో దూరి సర్పరాజు దాగుకొన్నాడు.

యథాప్రకారం గజరాజు వచ్చాడు. ఇదివరకుమల్లే కాకుండా తాను పెట్టివెళ్లిన పత్రి చెక్కుచెదరక అలాగే ఉంది! ఏమి అదృష్టం? ఆ రాళ్లు తెచ్చిపెట్టే మూఢుడేమైపోయినట్టు? చచ్చిపోయుంటాడు. శివుడే తన్ను కరుణించడంకోసమని ఆ దుర్మార్గుణ్ణి చంపివేసి ఉంటాడు!—సంతోషంతో గజరాజు మాలిన్యం తీసివేయటానికని తన తొండం పత్రిమీదకు చాపేడు.

లోపల దాగిఉన్న నాగరాజు ఇదంతా కనిపెడుతూనేఉన్నాడు. "ఇన్నాళ్ళనుంచీ నాపూజ పాడుచేస్తూ వున్నది నీవేనా? బాగా దొరికావులే. నీ పని పట్టే కాలం సమీపించింది. కనుకనే, నాకంట పడేటట్లుచేసి, శివుడు నన్ను అనుగ్రహించాడు' అనుకుని, తనవైపు వస్తూన్న ఏనుగతొండంలో పుసుక్కుమని దూరి, తొండంలోంచి గజరాజు కుంభస్థలాలలోకి పోయి అక్కడ ఇష్టమొచ్చినట్టూ మెదలడం మొదలెట్టేడు!



ఇంకేముంది? మెదడులోచేరి నాగరాజు అలా మెదులుతూవుంటే బాధకు నిలబడలేక గజరాజు అటూ ఇటూ పరుగెత్తనారంభించాడు. ఆపాము నెలాగైనా బయటకు రప్పించాలని తొండంనిండా నీళ్లు పీల్చుకుని, ముక్కుతో చీదేశాడు. నీళ్లు బయటకు వచ్చినవేకాని పాము లోపలే ఉండిపోయింది! చెట్టు బ్రూకులదగ్గరకెళ్లి, కుంభస్థలాలను రాసుకుంటే లోపల ఉన్న పాము ఒత్తిడికి ఆగలేక పైకి వచ్చేస్తుందని ఆశపడినాడుగాని, నాగరాజు లోపల్నుంచి కదలనేలేదు.

ఇంక గజరాజుకి ప్రాణాలమీద ఆశ పోయింది. "ఈ పాము నా మెదడులో తన విషాన్ని కక్కి నన్నెలాగా చంపివేస్తుంది. నామీద కసిబూనిన శత్రువును బ్రతుకనివ్వటం యెందుకు? దీన్ని చంపి మరీ చస్తాను" అని నిశ్చయించుకున్నాడు. ఎక్కడికీ పోకుండా పాము అతని తొండాన్ని మెలికలుగా చుట్టేసుకుంది; గజరాజు వేగంగా పరుగెత్తుకెళ్ళి ఎదురుగుండా ఉన్న కొండను తన కుంభస్తలాలతో ఢీకొనేవరకు దెబ్బకి లోపలఉన్న నాగరాజు చితికి చచ్చిపోయాడు. తల బద్ధలైపోయి, ఆ రక్తపు మడుగులో గజరాజు పీనుగై పడిపోయాడు.

*   *   *

పార్వతీదేవి భర్తదగ్గిరకు వచ్చి, గజరాజూ, నాగరాజూ చచ్చిపడి ఉండడం చూచి ఆశ్చర్యపోయింది. పరమేశ్వరుడు వాటి చరిత్రఅంతా చెప్పేడు. పార్వతీదేవి నాగరాజునూ, గజరాజునూ "మహాభక్తులు"ని మెచ్చుకుంది. పరమేశ్వరుడు, "మహాభక్తులేకాని వీళ్లిద్దరికీ ఒకళ్ల మతం అంటే ఒకళ్ళకి కిట్టంది కాదు. ఈ కిట్టక పోవడం తప్పు. ఎవళ్లకి ఏవిధమైన పూజ నచ్చితే ఆ విధంగా చెయ్యవచ్చు. అన్ని రకాల పూజలూ నాకు నచ్చుతాయి. పాముచేసిన మణులపూజా, ఏనుగవేసిన పత్రిపూజా కూడా నాకు నచ్చాయి. ఈ రహస్యాన్ని మన భక్తులు తెలుసుకోలేక ఒకళ్ల నొకళ్లు నాశనంచేసుకున్నారు. ఎవరి మతాన్ని వారు విశ్వాసంతో అవలంబించవలసిందేకాని ఇతర మతాలవాళ్లతో దెబ్బలాటకు దిగకూడ"దన్నాడు. పార్వతీదేవి "ఔను"ని ఒప్పుకున్న తరువాత పరమేశ్వరుడు ఆభక్తు లిద్దరికీ మోక్షం ఇచ్చాడు.

ఆ అడవిలో శివుడు వెలిశాడనీ, సర్పరాజుకీ గజరాజుకీ మోక్షం ఇచ్చాడనీ క్రమంగా అందరికీ తెలిసింది. శివభక్తుడైన రాజొకడు, అడవంతా కొట్టించి శివాలయం ప్రతిష్ఠింపించాడు. ఆ గుడిచుట్టూ ఇప్పుడొక పెద్ద ఊరు వెలిసింది. ఆ ఊరి పేరే కాళహస్తి 'కాళం' అంటే 'పాము', 'హస్తి' అంటే 'ఏనుగ'. పాముకూ, ఏనుగకూ మోక్షం కలిగిన స్థలం కనక, ఆ ఊరికి 'కాళహస్తి' అనే పేరు వచ్చింది.

ఇటువంటి మహిమగల కాళహస్తిలో 'స్వర్ణముఖి' అనే నది యాత్రికుల స్నానపానాలకు ఆధారమైయున్నది. ఇక్కడ మహాశివరాత్రినాడు గొప్ప తీర్థం జరుగుతుంది. లక్షలాది జనం అక్కడ ఈశ్వరుని దర్శనం చేసుకుని తరిస్తారు.






ఒకానొకరాజుకి ఏడుగురు భార్యలు. అయనకు అన్నీ ఉన్నాయికాని, సంతతిమాత్రం లేదు. ఇలా వుండగా ఒక యతీశ్వరుడు కనబడి మంత్రమహిమ గల ఆరు అరటిపళ్లు రాజుకు ఇచ్చాడు. రాజు సంతోషించాడుకాని, తీరాచూస్తే పళ్లు ఆరుమాత్రమే ఉన్నాయి. వీటిని ఏడుగురు భార్యలకూ ఎలా పంచడం? అదృష్టవశాత్తు ఆ సమయాన కోటలో ఆరుగురు రాణీలుమాత్రమే ఉన్నారు. చిన్నరాణి చుట్టాలింటికి చూడబోయింది. ఆమె వస్తే చూచుకోవచ్చునని చెప్పి ఆరుగురకూ ఆరు పళ్లూ ఇచ్చాడు.

ఇంతలో చిన్నరాణీవచ్చి, తను లేకుండా వాళ్లు ఇలా చేస్తారా అనే కోపంతో వాళ్లు పారవేసిన తొక్కలు తినివేసింది. ఆమెను చూచి అక్కలు "ఏమిటి, కోతిలాగ తొక్కలు తింటున్నది! దీనికి కోతిపిల్లే పుడుతుంది" అని గేలిచేశారు. అన్నట్టుగానే ఆరుగురు రాణీలకూ చక్కటి బిడ్డలు పుట్టారు. చిన్నరాణీకి కోతిపిల్ల పుట్టింది.

ఒకనాడు కొడుకులు ఆరుగురూ తండ్రి వద్దకు వెళ్లి ఓడప్రయాణం చేసి, ప్రపంచం చుట్టివస్తామనగా, రాజు సరేనన్నాడు. కపిరాజుకూడా వస్తానంటే వాళ్లు వీలులేదని చెప్పి కసరికొట్టేశారు.

అప్పుడు కపిరాజు వాళ్లకు తెలియకుండా ముందే పోయి, ఓడలో ఒకమూల నక్కి కూర్చున్నాడు. తరువాత ఈసంగతి తెలిసి అన్నలు ఆశ్చర్యపోయారు.

ఓడ పోయిపోయి వారం రోజులకు ఒక తీరం చేరుకొన్నది. ఆ రాజ్యంలో గొప్ప కోలాహలంగా ఉన్నది. అది ఏమిటీఅంటే, 'తన సింహాసనానికి ఎదుటవున్న రాతిని ఎవరైతే ఎత్తగలరో వారికి తన కూతురు నిచ్చి పెళ్లి చేస్తా'నని ఆ దేశపు రాజు ఒక ప్రకటన చేశాడు.

బి. సూర్యారెడ్డి, వరంగల్

ఆ ప్రకటన చూచి, ఆరుగురు అన్న దమ్ములూ పోయి రాయి ఎత్తబోయారు, కాని కదపలేక తెల్లముఖాలు వేశారు. అప్పుడు కపిరాజు దర్బారుకు వెళ్లి ఆ బ్రహ్మాండమైన రాతిని అవలీలగా పైకి ఎత్తేవరకూ అందరూ మెచ్చుకొన్నారు.

కపిరాజును పెళ్ళాడటం రాజకుమారికి ఇష్టం లేకపోయింది. కాని తను చేసిన ప్రకటన తప్పకూడదని రాజు కూతురును ఒప్పించగా, పెళ్లి జరిగింది.

తరువాత కపిరాజు భార్యతోసహా వాళ్ల దేశానికి బయల్దేరాడు. ఓడ వెళ్లివెళ్లి ఒక ద్వీపం చేరుకొన్నది. కపిరాజుకి ఆ ద్వీపాన్ని ఏలే రాజుకూతురు కనబడింది. ఆమె సౌందర్యవతి మాత్రమేగాక మంత్రవిద్యలో ప్రవీణురాలు. ఆకపిరాజు సుందరుడనీ శాప వశాన ఇలా ఉన్నాడనీ గ్రహించి, అతనిని పెళ్లాడటానికి ఆమె నిశ్చయించుకొన్నది.

ఆమె తన వుద్దేశాన్ని కపిరాజుకి తెలిసే వరకు అతను సమ్మతించాడు. పెళ్లి అయిపోయింది. ఈమెను వెంటబెట్టుకొని కపిరాజు ఓడవద్దకు పోయేసరికి పెద్ద భార్య విచారంగా ఉండటంచూచి, రెండవ భార్య "అక్కా! నీ విచారానికి కారణ మేమిటి? నీ భర్త కురూపిగా ఉన్నాడనేనా లేక మరేదైనానా?" అని అడిగింది. "అంత కంటె ఏమికావాలె?"నని పెద్దభార్య అనే సరికి, కపిరాజు జన్మను గురించిన రహస్యం చెప్పి ధైర్యంగా ఉండమన్నది.

చిన్నభార్య మంత్రబలంవల్ల కపిరాజు కోతిచర్మం ఊడి కింద పడిపోయింది. అతను అపురూప సౌందర్యంతో ప్రకాశించే రాజకుమారునిగా మారిపోయాడు.

ఈమార్పుకి భార్యలిద్దరూ సంతోషించి, ఆ రాజకుమారుణ్ణి భక్తితో సేవిస్తూ అన్యోన్యంగా ఉన్నారు.(ఆధారం: ఒకబర్మాకథ)



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

## ఆధారములు

**అడ్డము :**

2. చందమామ
4. నాపరాళ్లకు ప్రసిద్ధి
6. ముఖము
8. నదులు కలిసే చోటు
10. మనుష్యులు (అక్షరాల మార్పు)
11. ఒక పురాణపురుషుడు




**నిలువు :**

1. ప్రపంచము
3. కన్నము
5. గాలి
7. ప్రవహించునవి
8. నిజము
9. జెండా

## ముగ్గులు.



డి. అన్నపూర్ణ, నెల్లూరు



యం. హైమవతి, మద్రాసు




# పిల్లల పెంపకం

## సౌశీల్యము

ఆరోగ్యమునకు అవసరమైన సాధనాలలో సౌశీల్యము ముఖ్యమైంది. అయితే, 'ఆరోగ్యానికీ సౌశీల్యానికీ గల సంబంధం ఏమిటీ?' అని చాలామంది వింతగా అడుగుతారు. తగినంత నమ్మిక లేకనే సౌశీల్యమునుగురించి పాటించవలసిన విధులు పాటించరు. చెడ్డ ఆహారం శరీరానికి ఎంత చెరుపు చేస్తుందో, అంతకంటెకూడా ఎక్కువగా చెడ్డ వర్తనము దేహారోగ్యాన్ని భంగపరుస్తుంది. ఎలా అంటే—ఒక చెడ్డపని చేసినప్పుడు మనస్సు భయంతోనే నిండివుంటుంది. అందుకనే 'పాపం ఎక్కడ ఉంటుందో, భయం అక్కడ ఉంటుం'దని అంటారు పెద్దలు.

భయంవల్ల మానవునికి అనేక రోగాలు పుట్టుకొనివస్తయి. మానవజాతికి భయమంత ప్రబల శత్రువు మరిఒకటి లేనేలేదని చెప్పవచ్చు. కనుకనే, మనం చెడ్డపనులు చేయకూడదు అంటూ తలిదండ్రులు, గురువులు, మన క్షేమం కోరిన పెద్దలూ వీలయినప్పుడెల్లా బోధ చేస్తూవుంటారు.

పోతే—మంచి నడవడివల్ల మానవునికి ఆరోగ్యమూ, ఆత్మశక్తీ చేకూరుతుంది, ఒక గొప్ప పని చేయాలీ అనుకొన్నప్పుడు మనకు ఆత్మశక్తి కావాలి. ఆత్మశక్తి. సౌశీల్యంవల్లనే—అనగా మంచి నడవడివల్లనే—వస్తుంది. ఆత్మశక్తి అనగా మనకు తెలియకుండా లోపల ఇమిడి ఉండేటటువంటి-ఒక అద్భుతమైన బలము. ఇటువంటి బలమువల్లనే మన పురాణపురుషులు గొప్పపనులు నిర్వహించగలిగారు.

సౌశీల్యమువల్ల సంకల్పబలం కలుగుతుంది. సంకల్పబలం కావాలంటే ప్రశస్తమైన ఆరోగ్యభాగ్యం అవసరం. అందుచేతనే ఒక మహానుభావుడు "డబ్బుపోతే ఏమీ. పోదు, ఆరోగ్యంపోతే కొంతపోతుంది, సౌశీల్యంపోతే సమస్తమూ పోయినట్టే" అన్నాడు.

మీ పెద్దమ్మ




పైన ఉన్న తొమ్మిది బొమ్మలూ, అన్నీ ఒకేమాదిరిగా కనిపిస్తున్నా, నిజానికి అలా లేవు. తొమ్మిదింటిలో రెండు మాత్రమే ఒక్క మాదిరిగా వున్నై. ఆ రెండూ ఏవో కనుక్కోండి. మీరు కనుక్కో లేకపోతే జవాబుకి 55-వ పేజీ చూడండి.




## నారింజపండులో నాణెము తెప్పించుట

ఇంద్రజాలికుడు ఒక అరడజను మామూలు నారింజపండ్లు తీసుకువచ్చి సభవారికి చూపి, "చూడండీ! ఇవన్నీ ఏమిటనుకొంటున్నారో. ఇవి మేజిషియన్ల వద్ద ఉండే చిత్రమైన నారింజపండ్లు. ఈ పండ్లలో ప్రతిదానిలోనూ ఒకొక్క నాణెం ఉంటుంది. కావాలంటే చూసుకోండి" అంటాడు.

కొంతమంది ఉండబట్టలేక కొన్ని కాయలు కోసి చూస్తారు. కాని, వాటిల్లో ఏమన్నా ఉంటేగా? ఇక చేయవలసిన గమ్మత్తు అంతా ఇప్పుడే. సభలో ఒకరివద్ద నించి ఒక నాణెం తీసుకోవాలి. "ఈనాణెం మీద ఏదైనా ఆనవాలుంచుకోండి. మీ చేతితోనే స్వయంగా ఇవాళ్టి తారీఖుకూడా వేసుకోండి" అని నిబ్బరంగా చెప్పాలి. ఆ నాణెమును తీసుకొని, తెలిసిన పద్ధతులలో ఏవో ఒకటి అవలంబించి ఇంద్రజాలికుడు దానిని మాయం చేయాలి.



(ఇటువంటి వస్తువులను మాయం చేసే పద్ధతులు మీకు తెలిసివుంటాయనే వుద్దేశంతో ఇక్కడ విపులంగా చెప్పలేదు. ఇక ముందు ప్రొఫెసరుగారు ఆ సూక్ష్మపద్ధతులన్నిటినీ వివరిస్తూ వుంటారు.)

ఇప్పుడు సభవారిని ఒక నారింజపండు ఎంచి తిసికోమను. వారు తీసికొన్న పండును ఒక కత్తితో రెండుగా కోసివెయ్యి.



కోసినవెంటనే సభవారి నాణెం ఈ పండు లోపల (1 వ బొమ్మలోవలె) కనపడి అందరకూ ఆశ్చర్యం కలుగజేస్తుంది.

ఈ ట్రిక్కు చూడబోతే "ఇది ఎలా చేయగలిగాడా? ఇదేదైనా మంత్రమా, మహత్యమా?" అనుకొంటారు చూచేవాళ్లు. కాని, రహస్యం తెలుసుకున్న తరవాత ఇంత తేలికైన మేజిక్కు మరొకటి లేదని అనిపిస్తుంది. ఈ ట్రిక్కుయొక్క మహిమ అంతా ఇంద్రజాలికుడు ఉపయోగించే కత్తిలో వున్నది.

2 వ పటం చూచినట్టయితే ఈ కీలకం స్పష్టంగా తెలిసిపోతుంది. A అనేది ఏమిటి? B అనే నాణెమును కత్తికి గట్టిగా పట్టించే ఒక స్ప్రింగు. C అనేది స్ప్రింగును నొక్కే మీట. పండు కోయబోయేటప్పుడు కత్తి సగం లోపలికి పోగానే కత్తిపిడితో C అనే మీటను నొక్కాలి. నొక్కినట్టయితే కత్తిని అంటిపెట్టుకొని వున్న నాణెమును వదిలించి, పండుకు అంటుకొనేటట్టు చేస్తుంది. కత్తికి నాణెము అంటించిన ప్రక్కను ఇంద్రజాలికుడు తన వేపుకే ఉంచుకోవటంలో జాగర్త వహించాలి. లేకుంటే రహస్యం సభవారికి తెలిసిపోతుంది.




ఈ ట్రిక్కును గురించి చెబుతున్నప్పుడు కలకత్తాలో జరిగిన ఒకచిత్రం జ్ఞాపకానికివస్తుంది. నా బసకు దగ్గరగా పండ్లవర్తకు లుండేవారు. ఒక పండ్ల వర్తకుణ్ణి కలిసి 'అబ్బాయీ, నారింజపండ్లు డజనెట్లా? టోకుధర చెప్పు' అన్నాను. అతను కోరిన ధర చెల్లించి, ఒక అరడజను పండ్లు తీశాను.

పండ్లు తీసికొన్నతరువాత "అబ్బాయీ వీటిని నాకు అమ్మడంవల్ల చాలా నష్టపడ్డావుసుమా, పాపం!" అంటూ ఒక పండు కోసి చూపాను. అందులో ఒక పావలాకాసు కనపడింది. అలా తక్కిన ఐదు పండ్లూ కోసి చూపాను. అన్నింటిలోనూ తలొక నాణెము కనపడేవరకూ, పండ్లవర్తకుడు నిశ్చేష్టుడై కూలబడిపోయాడు. తరువాత తనవద్దనున్న తక్కిన పండ్లను అమ్మడం మానివేసి ఒక్కొక్కటే ఒలిచి చూడటం ప్రారంభించాడు !!!—

राम, यहाँ आओ।
यह चटाई है।
चटाई पर बैठो।
ये मास्टर साहब हैं।
मास्टर साहब को प्रणाम करो।
राम, तुम कल से स्कूल जाओ।
वहाँ खूब पढ़ो।

रमणी, तू यहाँ आ।
राम के पास बैठ।
ये मास्टर साहब हैं।
मास्टर साहब को प्रणाम कर।
तू भी राम के साथ स्कूल जा।
स्कूल में बहुत लड़कियाँ हैं।
लड़कियों के साथ खेल।

मास्टर साहब! कुरसी पर बैठिए।
चटाई पर मत बैठिए।
लीजिए, एक गिलास पानी पीजिए।
किताब राम को दीजिए और पढ़ाना शुरू कीजिए।

चटाई = చాప
बैठ = కూర్చోను
ये = వీరు, ఇవి
को = ని, ను, ల, కి, కు,
प्रणाम = నమస్కారము
तुम = మీరు
तू = నీవు
आप = తమరు
कल = రేపు, నిన్న
पानी = మంచినీరు
देना = ఇచ్చుట

शुरू = ప్రారంభము
यहाँ = ఇక్కడ
के पास = వద్ద, దగ్గర
भी = కూడా
के साथ = వెంట, తో
बहुत = చాలా
लड़कियाँ = ఆడపిల్లలు
कुरसी = కుర్చీ
मत = వద్దు
लेना = తీసుకొనుట
पीना = త్రాగుట

पढ़ाना = చదువు చెప్పుట

ఏదైనా ఒక పని చేయమని ఆజ్ఞాపించేటప్పుడు గాని, వద్దని నిషేధించేటప్పుడు గాని तू కర్త అయితే ధాతురూపాన్ని, (कर, पढ़, पी, ఇత్యాది) तुम అయితే ధాతురూపానికి ओ చేర్చి, आप కర్త అయితే ధాతురూపానికి इए చేర్చి ప్రయోగించాలి. ले, दे, कर, पी లకు మాత్రం इए బదులుగా जिए చేర్చాలి. జీతగాళ్ళూ, మరీ చిన్నవాళ్లూ ఐతే, तू, సమాన వయసుగలవారైతే तुम, పెద్దవాళ్లూ, గౌరవనీయులైతే आप ఉపయోగించాలి. దీనినే హిందీలో विधि (Imperative) అంటారు



ఈ చదరంలో ఒక్కరి బిక్కరిగా చాలా గళ్లు కనిపిస్తున్నవికదూ? కొన్ని గళ్లు ఖాళీగానూ, కొన్ని చుక్కలతోనూ వున్నవి. చుక్కలున్న గళ్ళకు రంగు పెన్సిలుతో రంగులు వెయ్యండి. గళ్ళల్లో దొంగని పట్టగలరు.

పజిలుకు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 లో | | | | 2 జా | 3 బి | ల్లి |
| 4 క | డ | 5 ప | | | లి | |
| ము | | 6 వ | ద | 7 న | ము | |
| | | న | | ద | | |
| | 8 స | ము | ద్ర | ము | | 9 ధ్వ |
| | త్యా | | | 10 లు | ను | జ |
| 11 భీ | ము | డు | | | | ము |

జవాబు

51-వ పెజీలోని చిక్కుబొమ్మలకి

జవాబు:

★

1, 9 నెంబర్లు గల బొమ్మలు రెండూ ఒక్కమాదిరివి.

★

# అట్టమీది బొమ్మ

అందమైన బృందావనంలో బలరాముడూ శ్రీకృష్ణుడూ గోపాలకులుగా వుండి, ఆ అడవులవెంట గోవులను తోలుకొనిపోయి, మేపుతూ ఉండేవారు. గోవుల తోనూ గోపికలతోనూ కలసి ఆడుకోవటమూ, గోవులను మేపడమూ వారికి సరదాగా ఉండేది.

ఇలావుండగా ఒకరోజున శ్రీదమనుడు, సుబాలుడు, స్తోకుడు మొదలైన చెలికాండ్రు బలరామకృష్ణులవద్దకువచ్చి, "కృష్ణా, కృష్ణా! మన ఈఅరణ్యానికి సమీపంలోనే తాటిచెట్లు కోకొల్లలుగా ఉన్నాయి. ఆ తాటిపళ్ల పరిమళం ఇక్కడికికూడా వేస్తున్నది. అవి తింటే ఎంత రుచిగా ఉంటాయనుకొన్నావు? కాని, ధేనుకాసురుడనే ఒక రాక్షసుడు గాడిద రూపంలో అక్కడ కాచుకూర్చుని, ఎవరినీ ఆ పండ్లు తాకనివ్వటంలేదు." అని చెప్పారు.

ఈ సంగతి వినడంతోనే, బలరాముడూ, శ్రీకృష్ణుడూ బయల్దేరి అక్కడకు వెళ్లారు. బలరాముడు తాటిచెట్లను పట్టి ఊపేవరకు, జలజలమంటూ వందలూ వేలూ తాటిపండ్లు నేలమీద రాలినై. ఈ అలజడి చెవినిపడగానే, గాడిదరూపంలోవున్న ధేనుకాసురుడు పరుగిడుకొంటూ ఎగేసుకువచ్చి, వెనుక కాళ్లతో బలరాముణ్ణి పడపడమని తన్ననారంభించాడు. 'బే! బే!!' అని అరచుకొంటూ, మళ్లీ ఎక్కువ వేగంతో రెండవసారి బలరామునిమీదికి వచ్చే వరకు బలరాముడు దాని వెనుకకాళ్లు రెండూ రెండు చేతులతో పట్టుకొని, గిరగిర తిప్పికొట్టి, ఆకాశానికంటా ఎగురవేశాడు. ఆ గాడిద గాలిపటంలాగ తిరిగి తిరిగి, దభీమని నేలమీదపడి చచ్చింది.

ఈవిధంగా రాక్షసగణంలో ఎన్నతగిన ధేనుకాసురుడు సంహరింపబడటంతో రాక్షసమూక అందరూ బిలబిలమంటూ వచ్చి ఎదురుతిరిగారు. అప్పుడు బలరామ కృష్ణులు వాళ్లందరనూ తుక్కుతుక్కుగా కొట్టి చంపారు.

ఇదిచూచి ప్రజలంతా సంతోషించారు. దేవతలు దుందుభులుమ్రోగించారు.




ఈనెల ఈ హంసల బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని
వచ్చేనెల (నవంబరు) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

## పూర్తిగా తగ్గింపు ధరలు

(కొద్దిరోజులకు మాత్రం)

ఈ క్రింది పుస్తకాలలో మీకు కావలసినవి ఏవైనా పోస్టుఖర్చులు లేకుండా చౌకగా తెప్పించుకోవచ్చును. **6-14-0** మనియార్డరుచేసిన **8-0-0** లు విలువగల పుస్తకాలు, **9-14-0** మనియార్డరుచేసిన **12-0-0** లు విలువగల పుస్తకాలు పోస్టుఖర్చులు మేమేభరించి పంపుతాము. వి. పి. లు చెయ్యము. మీకు కావలసిన పుస్తకాలకు **6-14-0** కాని, **9-14-0** కానీ ముందుగా మనియార్డరుద్వారా పంపండి. పుస్తకాలు రిజిస్టరు పోస్టులో పంపుతాము.

| | | | |
|---|---|---|---|
| విషాదం [చలం] వ్యాసాలు | 1 | 0 |
| ఆనందం .. .. | 1 | 0 |
| త్యాగం .. నాటకం | 1 | 8 |
| జయదేవ .. .. | 1 | 0 |
| శశాంక .. .. | 1 | 0 |
| సావిత్రి .. .. | 0 | 12 |
| పురూరవ .. .. | 1 | 8 |
| నాటికా గుచ్ఛం .. .. | 1 | 4 |
| డిటెక్టివు [చక్రపాణి అనువాదం] | 0 | 12 |
| ఉదరనిమిత్తం (మైత్రా) .. నాటకం | 1 | 0 |
| ప్రణయరోగులు [కుటుంబరావు] నాటకం | 1 | 0 |
| ఆరితేరిన ఘటం .. విదేశకథలు | 0 | 12 |
| బీరకాయ పీచు [కృష్ణమూర్తి] కథలు | 1 | 0 |
| మాలో మేము .. .. | 1 | 0 |
| ప్రైడ్ & ప్రెజుడిస్ ,, ,, | 1 | 0 |
| విశ్వం పెళ్ళి [సోమంచి] నాటకం | 0 | 12 |
| కళ్యాణి ,, ,, | 0 | 12 |
| జ్యోతిర్మయి [అ. వెం. నర్సు] ,, | 1 | 0 |
| తీర్పు [ధనికొండ] కథలు-నాటికలు | 0 | 12 |
| వెలవు [కప్పగంతుల] కథలు | 1 | 0 |
| ఋణవిముక్తి .. ,, | 1 | 0 |
| ఆనాపీలర్ [సౌరీస్] ,, | 0 | 12 |
| ఈస్టలిన్ [హెన్రీవుడ్] నవల | 2 | 0 |
| చచ్చిపోయిన మనిషి [పద్మరాజు] ,, | 0 | 12 |
| పొగడదండ [కొ. పద్మావతి] కథలు | 0 | 12 |
| సిపాయి కథలు [శిష్ట్లా] .. | 0 | 12 |
| మూగజీవాలు [గోఖలే] .. | 1 | 4 |
| చుక్కలూగీతలూ [ఎం.ఎస్.మూర్తి] కథలు | 1 | 0 |
| హర్ హైనెస్ [గద్దె లింగయ్య] నవల | 1 | 0 |
| స్వప్నవాసవదత్తము [కాటూరి] కావ్యం | 0 | 12 |

# యువ బుక్ డిపో

పోస్టుబాక్సు నెంబరు: **1686**, మద్రాసు, 1.

విద్యుచ్ఛక్తి లేదని విచారపడనేల !

**"హింద్" డ్రై బ్యాటరీ రేడియో నేడే కొనండి**

ఇందు చూపిన మోడలు కాక యింకా
3 మోడల్సులో కలవు.



ఉత్తరసర్కారులు, దత్తమండలములకు
— డిస్ట్రిబ్యూటర్లు —
ఆంధ్రా ఎలెక్ట్రికల్ హౌస్ లిమిటెడ్, ఏలూరు

## 'చందమామ' కు
## ఏజంట్లు కావాలి

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా **2-0-0** పంపుతూ వుంటే మీకు **7** కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా **0-10-0** లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయండి.

**చందమామ ఆఫీసు,**
పోస్టుబాక్సు నెం. **1686,** మద్రాసు - **1.**

# తండ్రి-కొడుకులు



పుస్తకము రెండవ ముద్రణ తయారైనది. ప్రతులు కావలసినవారు **0-9-0** తపాలుబిళ్ళలు పంపండి. లేదా మా ఏజంట్లను అడగండి. పుస్తక వ్యాపారులకు నూటికి 25% కమిషను యిస్తాము. కావలసిన ప్రతులకు వెంటనే వ్రాయండి.

## చందమామ పబ్లికేషన్సు

పోస్టుబాక్సు నెం. **1686,** మద్రాసు - **1.**

వర్షాకాలపు చలికి
వెచ్చటి దుస్తులు
కావాలి సుమా!

★

మీకు, మీ పిల్లలకు
ఆనందమూ, సొగసూ
యిచ్చే

**బి.డి.యం.కంపెనీ**
[కె.హెచ్.శ్యామారావు అండ్ సన్సు]
**బెంగుళూరు వారి**

# SAMSONS DRESSES

**మన్నిక గల దుస్తులను**
**నిత్యమూ వాడండి**

★

: ఆర్గనైజర్లు :

ఆంధ్రకు :
జి. వెంకటప్పయ్య అండ్ సన్స్,
గాంధినగర్, బెజవాడ.

నిజాముకు :
ఫ్రెండ్స్ ఎంపోరియం,
27, ఘాస్‌మండి రోడ్, సికింద్రాబాదు.

---

# డోంగ్రేగారి
## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును, ఆరోగ్యము నిచ్చును.

**K.T. Dongre & Co. BOMBAY - 4**

---

## ★ స్వాగతము ★

సహజ సౌందర్యాభివృద్ధికి మా రాజా ఆభరణములు అందము చేకూర్చును

బంగారు కవరింగ్ చేయబడిన RAJA బ్రాండు ఆభరణములు
కలదు 10 సం॥ గ్యారంటి
172/6
RAJA 237/1 R COLOURED LOLAK Rs. 5-8-0 PER PAIR
NETAJI, NEHRU, SAIBABA PHOTO RINGS Rs. 3-2-0 EACH
COLOURED STONE RING Rs. 2-12-0 EACH
BABY RING Rs. 1-0-0 EACH
Rs. 2-0-0 EACH
PLAIN RING
CUFF-LINKS 371 Rs. 1-12-0
NEHRU KRISHNA NETAJI ETC. 2-0-0
PIN 0-8-0 EACH
RAJA 265 RAJA 266 RAJA 265/1 RAJA 265/2
BUTTONS EACH 0-9-0. Catalogue free on Application
రాజా గోల్డు కవరింగ్ కంపెని, మచిలీపట్నం.

ఆర్డరుతోపాటు 800 ఆభరణములు గల కేట్లాగు వుచితంగా పంపుతాము
పాకింగు పోస్టేజి 0-14-0 అదనం
నేడే ఆర్డరు వ్రాస్తారు కదూ.

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras.

